# అనుబంధాలు

[ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి
(1960-61) పొందిన ప్రథమ సాంఘిక నాటకము]

ఒంటెల సిద్దేశ్వర్



ఆదర్శ గ్రంథమండలి

నా

ఊహకూ భావానికి

జీవం అయిన

నా

ఇలవేల్పుకు

ప్రేమతో

—సిద్దేశ్వర్.

ఈ 'అనుబంధాలు'ను ప్రదర్శింపదలచువారు
(ర.స.న.సమాఖ్య-విజయవాడతప్ప)
నా అనుమతి పొందాలి

— ర చ యి త

Rly. కోడూరు

కడపజిల్లా.

# అభిప్రాయాలు

అనుబంధాలు చదివాను.
ఏంచెప్పాలో తెలియటంలేదు.
ఈ చిరంజీవికి
మంచి భవిష్యత్ ఉందనీ—
ఉండాలనీ ఆశీర్వాదిస్తున్నాను.

— లత.

## నా కృతజ్ఞతలు

ఈ రచనకు ప్రోత్సహించిన
మిత్రులు శ్రీ డి. జి. రాజుకూ,
అలుగంటి నరసింహులుకూ—
సలహాలిచ్చి సహకరించిన
శ్రీ వి. యస్ నందాగారికీ—
ఈ నాటకాన్ని చదివి నా ఉన్నతిని
కాంక్షిస్తూ ఆశీర్వదించిన
మహారచయిత్రి శ్రీమతి "లత"గారికీ—
నా నాటకాన్ని ప్రదర్శింపపూనుకొన్న
ర. స. న. సమాఖ్య (విజయవాడ)కూ—
ముద్రణకు పూనుకొన్న ఆదర్శగ్రంథమండలి
అధినేతలు శ్రీ గద్దే లింగయ్యగారికీ—

—రచయిత.

# ఇందలి పాత్రలు

ఉమాకాంత్
మధు
విద్యాసాగర్
రాఘవయ్య
శేఖర్
కుమార్
సుబ్బయ్య
రఘు
రమాదేవి.

# అనుబంధాలు

## మొదటి రంగం

[తెర లేచేసరికి రాఘవయ్యయింటిలో ముందు హాలు కన్పిస్తుంది. హాలులోనుండి లోనికెళ్ళడానికి తలుపులుంటాయి. ఒక సోఫా, దాని కటూ యిటూ రెండుకుర్చీలు, వాటిమధ్య టీపాయి వుంటాయి. ద్వారానికి ఎడమప్రక్క గోడనానుకొని ఒక టేబిల్, దాని మీద రేడియో, రేడియోమీద రమ - మధు - విద్యాసాగర్ - శేఖర్‌ల ఫొటోస్టాండులుంటాయి. కొన్ని పుస్తకాలు అందంగా పేర్చబడి, దాని ముందొక కుర్చీ వుంటుంది. ద్వారానికి ఆకుపచ్చటితెర వుంటుంది.

తెర తొలగ్గానే రంగస్థలంలో ఎవరూ ఉండరు. రేడియోనుండి శ్రావ్యమైనసంగీతం విన్పిస్తూవుంటుంది. కొద్ది విరామంలో రమాదేవి లోపలనుండి ప్రవేశించి, టీపాయిమీదున్న ఫ్లవర్‌వాజులో తెచ్చిన పూలను సర్ది లోపలికెళ్ళిపోతుంది, వెనువెంటనే విద్యాసాగర్ ప్రవేశించి కుర్చీలోకూర్చొని గాగుల్సుతీసి టీపాయిమీదుంచి చేతిలోని పేపరు చూస్తూ—]

విద్యా : రమా !

రమ : (లోపలనుండే) ఓయ్! వస్తున్నా! (విద్యాసాగర్ లేచి వెళ్ళి రేడియో ఆపేస్తాడు. రమ ప్రవేశిస్తూ విద్యాసాగర్‌ని చూసి చిరునవ్వుతో) నీవటరా

అన్నాయ్! ఎవరో అనుకొన్నా. పొద్దుటే యిలా వచ్చావేం?

విద్యా : శుభవార్త నీ చెవిలోవేసి - నీ చేతికాఫీ......

రమ : ఏమిటన్నాయ్, ఆ శుభవార్త?

విద్యా : సరే, అలాగే చెప్తా - మరి నా కేమిస్తావ్?

రమ : ఏదో యిస్తాలే - ముందు చెప్పరా.

విద్యా : అహఁ అలా వీల్లేదు.

రమ : అబ్బబ్బ, సస్పెన్సుతో చంపక త్వరగా చెప్పరా - అంటే!

విద్యా : ఏం? లంచం లేందే నేనుమాత్రం ఎందుకు చెప్పాలి?

రమ : అయితే వస్తా! (విసవిస లోనికెళ్ళబోతుంది)

విద్యా : (రమబుజం పట్టుకొని ఆపి) మీ రిజల్ట్సు వచ్చాయి.

రమ : ఓస్! అంతేనా, ఏమో అనుకొన్నా!...అయితే అన్నాయ్! నేను పాసయ్యానా?

విద్యా : (చేతిలోని పేపరందిస్తూ) Yes. First Classలో ... Congratulations మిసెస్ రమామధూ!

రమ : (సిగ్గుపడి) చాల్లే వేళాకోళం!...ఒగే అన్నాయ్! మన మధు మరీ కంట్లో నలుసైపోయాడే - ఎప్పుడొస్తాడేమిటి?

విద్యా : నాకు తెల్సులే! ఆ ఆందోళనంతా మధూను చూడాలనేగా? ప్చ్ ... ప్చ్ ఏంచేస్తాం! మధు

యిప్పుడప్పుడే రాడు. ఇదిగో చెల్లాయ్! మరీ యింత నిరీక్షణ...

రమ : అన్నాయ్! (చిలిపిగా కొట్టబోతుంది)

విద్యా : ఆగు చెల్లాయ్! (మాటలు సాగదీస్తూ) ఇంకా పెండ్లికాలేదే - అప్పుడే సర్వాధికారాలూ -

రమ : ఛీ, పోరా! నీతోటి ఏదన్నా గొడవే! (పోతూ వుంటుంది)

విద్యా : చెల్లాయ్!... చెల్లాయ్! (రమను సమీపిస్తాడు)

రమ : (ఆగి, బుంగమూతిపెట్టి) నువ్వెప్పుడూ యింతే.

విద్యా : అదికాదమ్మా, మన మధూ...

రమ : ఆ - మన మధు?

విద్యా : ఊహు! నే చెప్పను.

రమ : (బ్రతిమాలుతూ) ఊరించకురా! అదేదో త్వరగా చెప్పు.

విద్యా : మరేం—

రమ : ఊ!

విద్యా : మరేం...మరేం (రమను చూచి పకపక నవ్వుతాడు. రమ మూతి ముడుచుకొంటుంది. విద్యాసాగర్ యిది చూచి) నేనేమో చెప్తా - ఆ ఆనందంలో నీ గుండెకాస్తా ఆగితే...

రమ : ఛో అన్నాయ్, నువ్వు మరీను. (మారాంచేస్తూ) చెప్పరా!

విద్యా : మన మధు స్కాలర్‌షిప్‌మీద ఫారిన్ పోతున్నాడు.

రమ : ఆ! – నిజం ?...అయితే – యిక్కడ హాస్పిటల్లో ఎవ రుంటారు ?

విద్యా : నేనున్నాగా !

రమ : నీవా !...నీవా !! (పకపకలాడుతూ) ఇక అయి నట్టే! నీవా కొత్తవాడివి. నలుగురిని చంపందే...

విద్యా : డాక్టరు కాడని మన పెద్దలంటారు. మన మెవ్వరినీ చంపందే డాక్టరయ్యాం (రమతలమీద మొట్టుతూ) తెలుసా ?

రమ : అబ్బ ! (తల గోక్కుంటూ) గొప్ప ! చూస్తాంగా నీ హస్తవాసి !

విద్యా : (వెటకారంగా ఆడగొంతుకతో) అవునులే రమా! నీ మధు హస్తవాసే గొప్పదిలే !

రమ : (గయ్యాళిలా) ఒకే అన్నాయ్ ! ఇదిగో – యిప్పుడే చెప్తున్నా – (ఇక మాట్లాడలేక నవ్వుతుంది. విద్యాసాగర్ రమతో జత కలుపుతాడు)

విద్యా : (వాచి చూచుకొని) వెళ్ళొస్తా రమా ! (పోబోతాడు)

రమ : అన్నయ్యా !

విద్యా : (పరవశంతో) అన్నయ్యా ! (రమదరిజేరి రమ తల నిమురుతూ) మనం ఒక తల్లిబిడ్డలం కాకున్నా – నీ పిలుపులో ఎంత ఆత్మీయతుందమ్మా !

రమ : ఆత్మీయతే కాదన్నాయ్ ! అన్నాచెల్లెళ్ళ 'అను బంధాలు' అలాంటివి.

విద్యా : చెల్లాయ్ !

రమ : అన్నాయ్! (ప్రేమతో ముందుకు వస్తుంది)

విద్యా : (ఆత్మీయతతో దగ్గరకు తీసుకొంటూ) చెల్లాయ్! ...తోబుట్టువును పోగొట్టుకొన్న మందభాగ్యుణ్ణి!... ఈ జన్మ కింత కమ్మని పిలుపు చాలమ్మా! (రెండు ఆనందబాష్పాలుజారి చెక్కిళ్ళవరకు వస్తాయ్. రమ తన చేత్తో వాటిని తుడుస్తుంది.) మనమధ్య 'అనుబంధాలు' శాశ్వతం రమా! మన అనుబంధాన్ని ఎవ్వరూ విడదీయలేరు...ఇక వెళ్ళొస్తానమ్మా!

రమ : కాఫీ తాక్కుండానే? ఊహు! వీల్లేదు.

విద్యా : ఇప్పటికే ఆలస్యమైంది. హైద్రాబాదుకెళ్తూ యిలా వచ్చా!

రమ : హైద్రాబాదుకా! ఎందుకూ?

విద్యా : ఏంలేదు. అర్జంటుగా రమ్మని బావ వైరిచ్చాడు.

రమ : తిరిగి మళ్ళీ రావడ మెప్పుడు?

విద్యా : త్వరలోనే - వారం పదిరోజుల్లో!

రమ : అన్నాయ్! మధు వచ్చినతరువాత వెళ్ళకూడదా?

విద్యా : అలాగే అనుకొన్నానమ్మా! మధు మద్రాసు నుండి రావడానికి యింకా వారం పదిరోజులు పట్టొచ్చు. అందుకని వెళ్ళక...

రమ : (నిరుత్సాహంగా) తప్పదటరా?

విద్యా : తప్పదమ్మా!

రమ : ఎటూ మధూకూడా లేడు. నీవూ వెళ్తే నాకేం తోచదు. వారం పదిరోజుల్లో తప్పకుండా వస్తావా?

విద్యా : అలాగే!

రమ : నిజం ?

విద్యా : ఒట్టు. సరా! తప్పకుండా వస్తా! వస్తూ నీపెళ్ళికి...

రమ : చాల్లే, మళ్ళీ ఏమి టా మాటలు? ... అన్నాయ్!
(సిగ్గుతో తల వాంగిపోతుంది)

విద్యా : సిగ్గెందుకమ్మా! ఊఁ – చెప్పు!

రమ : ...మా పెళ్ళికి మీ బావగారు అంగీకరిస్తారా ?

విద్యా : ఒప్పుకోక ఏంచేస్తారు? అయినా అన్నిటికీ నేనున్నాగా! సరా? (అంటూ చిలిపిగా రమకళ్ళల్లోకి చూస్తాడు. రమ చిలిపిగా కళ్ళతో వెక్కిరించి నవ్వుతుంది) వెళ్ళిరానా చెల్లాయ్! (వెళ్ళిపోతూ వుంటాడు. రమాదేవి టీపాయిమీదున్న గాగుల్సు తీసుకొని తాను ధరించి—)

రమ : అన్నాయ్! (విద్యాసాగర్ ఆగి వెనుతిరిగి చూచి గాగుల్సు జ్ఞాపక మొచ్చి రమనుండి గాగుల్సు తీసుకో బోతాడు)

రమ : (వారిస్తూ) ఊఁహు! (తనే గాగుల్సుతీసి విద్యాసాగర్ కళ్ళకు తగిలిస్తుంది)

విద్యా : (రమతలమీదమొట్టుతూ) పిచ్చిచెల్లాయ్! (నవ్వుకొంటూ బయటకు వెళ్ళిపోతాడు. రమ అవ్యక్తానందంతో వెళ్ళిపోతున్న విద్యాసాగర్ని చూసి - తరువాత రేడియో ట్యూన్ చేసి, రేడియోమీదున్న మధుఫోటో అందుకొంటుంది.

రేడియోలో : ...ఆకాశవాణి, మద్రాసు నిలయం. యువ రచయిత డాక్టర్ మధు 'నివేదన' వింటారు......

'ప్రేమచకోరీ! నా కనుసన్నల్లో మధురభావాలెన్నో మెరపుల్లా మెరుస్తున్నాయ్...మనసును మైమరిపించెడు నీ సోయగం–తేనియలొల్కు నీ పల్కులు సరాగాల వలపు పిలుపులై నా హృదయవీణను మీటుతున్నవి...నామేను నవశోభలీను నీమేని వలపుకౌగిటికై పరితపిస్తూంది. మంజుమనోహరీ! నను దరిజేరరావా? నీ ప్రాపుకై పరితపించే నా హృదిలోని ఆలాపన అమరగానమై నిను మేల్కొల్పడంలేదా? నా దరిజేరి ఆనంద క్షీరసాగరంలో హంసద్వయంనోలె హాయిగ – ముదమార విహరింప రాలేవా? స్నేహమయీ! పలుకవేం? ప్రేమవాహినిలో మన ప్రణయవిహారానికి రావూ! ... అందుకో ప్రియ నెచ్చెలీ నా హృదయ...'అమేయానందంతో కాల్పనిక జగత్తులో విహరించే రమ నవ్వుకొంటూ వెళ్ళి రేడియో ఆపేసి, తనలో తనే నవ్వుకొంటూ లోపలికెళ్ళిపోతూవుంటుంది. అప్పుడే చేతిలోని టెన్నిస్ రాకెట్ వూపుకొంటూ హుషారుగ ప్రవేశించిన శేఖర్ రమను చూచి పరవశంతో ఆగిపోతాడు. రమ లోనికెళ్ళిపోతుంది.

శేఖర్ : ఓ! రమ్యమయి రమ! Beautiful! ... రమ నా బ్రతుకుబాటకు వెలుగుతార – నా ప్రేమసితార కూడా! రమ 'ఊ' అంటే – నా జీవితం నందన వనంలో – వెన్నెలవెలుగులో – గులాబీలా పాన్పుల్లో (మాటలింకాక ఆ మధురానుభూతులను...

వూహించుకొంటూ వున్మాదిలా వూహాగానంచేస్తూ వూర్ధ్వలోకాల్లో విహరించి ఆనందిస్తూ - అంతలో యీ లోకానికొచ్చి - నిట్టూర్చి) ఇక్కడే వచ్చింది గట్టిచిక్కు. తననుకోరే నన్ను కాదని మధూని ప్రేమిస్తూంది. (నవ్వి) పాపం - అందనీ - అతకనీ అనుబంధమని తెలియదేమో! ఊరికే అన్నాడా షేక్స్‌పియర్ 'Love is blind' అని. అనుక్షణం తనకోసం ప్రాకులాడే నన్ను కాదని ఆ Idiot మఘూకు మనసిస్తుందా? ... అనురాగమయి అనార్కలి-ప్రేమమయి లైలా - స్నేహమయి పార్వతి - ఆరాధనీయ జూలెట్‌ల అచంచల ప్రేమకు ప్రతిఫలం యీ రమ్యమయి రమకు తెలియదా? ప్రగాఢప్రణయం ప్రళయాలకు ప్రబల నిదర్శనమని అనాదినుండి మనకు కావ్యాలు చెప్తూనేవున్నాయ్. కానీ, మనిషి ప్రేమించకా - ప్రేమింపబడకా వుండలేకున్నాడు. స్త్రీ - పురుషులమధ్య యీ ఆకర్షణకు కారణం? - కామలిప్సేనని నే నంటాను. దీనికి మీరేమంటారు? అవునంటారా - కాదంటారా? రమ ఏమంటుందో తెలుసా? తన ఆరాధనలో దైహికవాంఛలు లేవంటుంది. మరి- వానిమీద దేనికి దీని కింత ఆరాధన? (దీర్ఘంగా ఆలోచిస్తూ పచార్లుచేస్తుంటాడు. రమ ప్రవేశించి శేఖర్‌ని చూచి—)

రమ : నీవా బావా! టెన్నిస్కోర్టునుండేనా? (శేఖర్ పల

కన్నీండా వుండటం చూసి, శేఖర్‌ని సమీపించి) ఓ బావా!

శేఖర్ : ఆ – (వెనుతిరుగుతూ) ఎవరూ?

రమ : ఏమిటా దీర్ఘాలోచన?—బుఱ్ఱ పగుల్తుంది.

శేఖర్ : పోవే రమా! నీవు మరీ పెంకిపిల్లవయ్యావ్.

రమ : (తేలికగా) నిజమే!

శేఖర్ : (ఉక్రోషంతో) నీకు ఒక మంచీ-మర్యాదా లేదు.

రమ : (హేళనగ) లేదు.

శేఖర్ : నీ ప్రవర్తన నాకేం నచ్చటంలేదు.

రమ : నచ్చకపోతే—

శేఖర్ : చెప్పేది వినమంటాను.

రమ : వినడంలేదేమిటి?

శేఖర్ : ఈవేళ పేపరు చూశావా?

రమ : కొత్తేముంది?—చూశాను, సర్జన్ మధు ఫారిన్ పోతున్నట్లు...

శేఖర్ : బ్రూట్! నీ కెప్పుడూ వాడి గొడవేనా? నా సంగతి......

రమ : ఏముందేమిటి?

శేఖర్ : బి. ఏ. లో క్లాసొచ్చింది.

రమ : నాలుగుసార్లు ఫెయిలయ్యాక.

శేఖర్ : ఆ!...వాటర్...వాటర్. (రమ నవ్వుతూ వెళ్ళి నీళ్లు తెచ్చిస్తుంది. శేఖర్ నీళ్ళందుకొంటూ—) నీ తెల్లటి వ్రేళ్ళతో చల్లటి నీళ్ళందిస్తుంటే (రమ

(వేళ్ళను మెల్లగ స్పృశిస్తూ) ఎంత హాయిగ-తీయగ వుంది.

రమ : ఊఁ...

శేఖర్ : నేను పాసైనందుకు కనీసం—

రమ : **Congratulations!**

శేఖర్ : **Thank you.** బి. ఏ. కూడా పూర్తయింది.

రమ : ఇక ఎం. ఏ. వుందోయ్ బావా!

శేఖర్ : ఇంకా చదువా! చస్తే చదవను. హాయిగా పెళ్ళి చేసుకోని...

రమ : (నవ్వుతూ) అలాగేం! చూడు బావా! కొంపదీసి ఎవత్తెనైనా ప్రేమించావా ఏమిటి?

శేఖర్ : ఆ - ప్రేమా - గీమా నాకు తెలీదు. ఆవిడంటే నా కిష్టం. అంతే!

రమ : మనసులు కలియడమే ప్రేమ. మనసైన మనువులు రథచక్రాల్లా సవ్యంగా సాగిపోతాయి. అప్పుడే ఆ దాంపత్యం సౌఖ్యనంతమూ - చరితార్థమూ అవుతుంది బావా!

శేఖర్ : అలాగా! అయితే - యిప్పుడు నేనూ ప్రేమిస్తున్నా. ఆమెను నే నెలా ప్రేమిస్తున్నానంటావ్ - ఆమెకోసం ఏమయినా చేస్తా.

రమ : (నవ్వుతూ) ఇంతలోనే ప్లేటు ఫిరాయింపా!

శేఖర్ : నిజం రమా!

రమ : ఎవరబ్బా ?—ఆ, నీ వలపుతలపుల జవరాలు. చెప్పు, చూద్దాం!

శేఖర్ : నేనుచెప్తే నీవు నమ్మవు. కానీ, ఆవిడ నీకు బాగా తెలుసు.

రమ : ఎవరబ్బా ?

శేఖర్ : చెప్పనా ? ఆమె నీవు – నీవే ఆమె.

రమ : ...క్షమించు బావా ! ఇది నా జీవితసమస్య.

శేఖర్ : నాకూ యిది జీవన్మరణసమస్యే రమా !

రమ : (బాధగా) బావా !

శేఖర్ : నీ స్వార్థంమరచి, న న్నర్థంచేసుకో రమా ! నా ఆశలన్నీ నీవే ! నీవులేని నా జీవితం...

రమ : బా...వా!...ఇప్పుడు నే నేంచెయ్యను ? న న్నేం చెయ్యమంటావ్ బావా ?

శేఖర్ : నాచే మూడుముళ్లూ వేయించుకోమంటాను. నన్ను సుఖపెడుతూ – నువ్వూ సుఖపడమంటాను. ఏమంటావ్ ?

రమ : అదీ జన్మలో జరగదంటాను.

శేఖర్ : అంతేనా ?

రమ : అంతే !

శేఖర్ : అయితే___

రమ : ఇంకేమీ చెప్పొద్దు. నీతో ఏనాడో చెప్పానుగా ?

శేఖర్ : ఏమని ?

రమ : మధూని ప్రేమించానని.

శేఖర్ : దూరమాలోచించమన్నాగా ?

రమ : ఇక ఆలోచించాల్సిందేమీ లేదు.

శేఖర్ : ఏమిటి నీవు ఆలోచించింది ?___మన పరువు, ప్రతి

ష్టల్ని బజారెక్కించడమా ? నీతీ - జాతీ అక్కర్లేదా ! సిగ్గులేదూ !

రమ : (నవ్వి) ఇందులో సిగ్గుపడాల్సిందేముంది బావా ? ప్రేమికులకు కుల - మత - జాతి విభేధాలేమిటి ? ప్రపంచం మారింది. మనం మారాలి. మారి మన ఆచారాలను సంస్కరించాలి. మనం కొంతకాలం విదేశీయులదాస్యంలో ఎందుకున్నామో నీకు తెలీదా ?...గతాన్ని ఒక్కమారు సింహావలోకనం చేసుకో బావా! జాతి కుల మత కలహాలలో మనలో మనకు ఐక్యత లేకనే - మనం పరదేశీయులకు బానిసలమై దాస్యం చేశాం. దాస్యవిముక్తికోసం - దేశ స్వాతంత్ర్యసాధనకు - హిందూ ముస్లిం ఐక్యతకై అసువులుబాసిన జాతిపిత పూజ్యబాపూజీ ... ఏమన్నాడు ? కుల మత జాతి విద్వేషాలే భారత రాజ్యరమా ప్రగతికి ప్రతిబంధకాలన లేదా ? - ఆ మహనీయుని అడుగుజాడలను అనుసరించడం మన జీవితపరమావధి కాదా ? చెప్పు బావా !

శేఖర్ : భావోద్రేకంలో దంచేశావేకానీ, ఆ మహాత్ముడే ఏమన్నాడో తెలుసా ?

రమ : ఏమన్నాడేమిటి ?

శేఖర్ : 'ఆదర్శాలు మాటల్లో కాదు, చెప్పింది చేసి చూపించడంలోవుంది' అన్నాడు. అంతేకానీ, ఆశయాలకూ ఆచరణలకు పొత్తేకుదర్దు.

రమ : మంచీ - మానవత్వంగల అభ్యుదయ ఆదర్శ...

శేఖర్ : ఆ – ఏదో లెద్దూ; అర్థంకాని ఆ గొడవలు మన కెందుకు? ముందు మనగొడవేదో చూడు.

రమ: మన గొడవేమిటి బావా?

శేఖర్ : అదే – నీవు మధూను మరచి నాకు మనసివ్వడం!

రమ : పిచ్చిబావా! హిందూస్త్రీ ఒకే వ్యక్తికి మనసిస్తుంది. అతనే ఆమెకు ఆరాధ్యదైవం. పోనీ, నీవే మనసు మార్చుకోరాదా బావా?

శేఖర్ : రమా!

రమ : (నిట్టూర్చి) మా పెళ్ళికి నీ సహకారం ఎంతయినా వుంటుందని ఆశించాను. (శేఖర్ ఏదో చెప్ప బోతాడు.) అలా నిల్చున్నావేం బావా? కూర్చో! కాఫీ పట్టుకొస్తా! (రమ లోపలికెళ్తుంది.)

శేఖర్ : (వెళ్ళే రమవేపు చూసి) నా సహకారం! (అదో మాదిరి నవ్వి ఆలోచిస్తూ పరధ్యానంగా వుంటాడు. కొద్ది విరామంలో రాఘువయ్య ప్రవేశిస్తాడు. ఒక చేతిలో జిప్ బ్యాగ్, మరొకచేతిలో పేపరుంటుంది. శేఖర్ని చూసి)

రాఘు : ఏరా శేఖర్! (శేఖర్ పలక్కుండా పరధ్యానంగా వుండటం చూసి) హేయ్ శేఖర్! (శేఖర్ వెనుతిర గ్గానే) విన్పించడంలా? (ఇంతలో రమ కాఫీతో ప్రవేశించి–)

రమ : ఎప్పుడొచ్చావ్ నాన్నా?

రాఘు : ఇప్పుడే వస్తున్నానమ్మా! (పేపరు చూస్తూ) నీ నంబరెంతన్నావ్?

రమ : (శేఖర్‌కు కాఫీ అందిస్తూ) 360. ఫస్టుక్లాసొచ్చింది నాన్నా !

శేఖర్ : (కాఫీ సిప్‌చేస్తుంటాడు)

రాఘు : వస్తుందమ్మా - వస్తుంది. నీకు రాకపోతే మరెవరి కొస్తుంది?......ఆ-మరచానమ్మా! ఇది విన్నావ్? మన ఎదురింటి మధు ఫారిన్ పోతున్నాట్ట. (రమకు పేపరు చూపెట్తూ) ఇదిగో - యిక్కడ చూడు. మధు ఫోటోతో వివరాలుకూడ వేశారు. (రమ చూస్తూవుంటుంది) మధు చాలా తెలివైనవాడమ్మా! (శేఖర్ వైపుచూస్తూ) వీడూ వున్నాడు ఎందుకూ - నాలుగుమార్లు తప్పాడు బి.ఏ. లో.

రమ : బావా పాసయ్యాడు నాన్నా !

రాఘు : ఉ - మంచిది. ఏరా శేఖర్ ఎం.ఏ.కు పోతావా ?

శేఖర్ : ఉద్యోగం చేయాలనుకొంటున్నా.

రాఘు : అదికాదురా, మన కెందుకు వుద్యోగాలు చెప్పు? అయినా, నీకు నౌకరీచేయాల్సిన అవసరమేముంది? అంతో-యింతో వున్న మనమే వుద్యోగాలకు దేవుళ్ళాడితే - వున్న ఆస్తి బేరంపెట్టి చదువుకొన్న పేదవా ళ్ళేంకావాలి? చూడు నాయనా! మీ అమ్మ నిన్ను నాకు పోతూ అప్పగించింది. నిన్ను కొడుకులా పెంచాను - పెద్దచేశాను. ఏదో, యింత చదువు చెప్పించాను. నా వయస్సా వాటారింది. ఇక నేనా తిరగలేను. ఇక నీకు చదవడం యిష్టం లేదంటావా-ఇంటిపట్టునే వుండు.

శేఖర్ : మీ యిష్టం మామయ్యా! అలాగే కానివ్వండి!

రాఘు : అబ్బ! ఇక నాకు ఒకే ఒక బాధ్యతుంది. మీ యిద్దరికీ పెళ్ళిళ్ళు చేసేస్తే—ఆ, రమా! మీ లెక్చరర్ కుమార్ నిగూర్చి నీ ఉద్దేశం?

రమ : చాలా మంచివారు. తెలివైనవారు. అయితే, ప్రతి చిన్నవిషయానికీ బాధపడతారు. క్లాసులో ఎవరన్నా తప్పుచేస్తే, ముఖాన్నే అడిగేస్తారు. ఆయనంటే కాలేజీలో అందరికీ గౌరవమే!

రాఘు : నా ప్రయత్నం వృథాకాదని నాకు తెలుసు. నిన్ను కుమార్ కిచ్చి, కుమార్ అక్కకూతుర్ని శేఖర్ కు చేసుకోవాలనుకొంటున్నా.

శేఖర్ }
రమ } ఆ!

రాఘు : ఎందుకు మీకింత ఆశ్చర్యం? (రమ దిగులుగా లోనికెళ్తుంది. రాఘునయ్య రమ వెళ్ళినవేపే చూస్తుంటాడు)

శేఖర్ : మామయ్యా! ......... ఆ... ఆ... ఏంలేదు! (చెప్పేందుకు తటపటాయిస్తాడు)

రాఘు : సంశయిస్తావెందుకు, చెప్పరా!

శేఖర్ : నా వెనక మీరుతప్ప ఎవరూ లేరు. నా ఉద్దేశం—ఏదో, రక్తంలో రక్తం. అందుకని...

రాఘు : ఆ—అందుకని?

శేఖర్ : రమను నేనే చేసుకోవాలనుకొంటున్నా!

రాఘు : చూడు నాయనా! రమనూ, నిన్నూ ఇలా చేస్తే

త్రోటి పెంచాను. నాకుండే రెండుకళ్ళూ మీరిద్దరే! నా దృష్టిలో నీవూ, రమా ఒకటే!

శేఖర్ : అంటే ?

రాఘు : అర్థంకాలా? పెంచిన మమత నీకు తెలీదు నాన్నా! కొడుకుగా తప్ప నిన్ను అల్లుడుగా చూడలేక పోతున్నా.

శేఖర్ : అంతేనంటారా ?

(రమ కళ్ళొత్తుకొంటూ ప్రవేశిస్తుంది)

రాఘు : నీవే చెప్పు, నన్నేం చెయ్యమంటావ్ !

శేఖర్ : (దుడుకుగా) నా జీవితం యిలా......

రాఘు : శేఖర్ !

శేఖర్ : ఛీ, మీ వంశమే యింత. తడిగుడ్డలతో గొంతులు కోసరకం.

రాఘు : (రమతో) విన్నావా రమా! వాడేమంటున్నాడో?

రమ : ఆ మాటలేం పట్టించుకోకు నాన్నా! బావేం మాట్లాడుతున్నాడో ఆయనకే తెలీదు. మీరు లోపలికెళ్ళండి. నువ్వూ వెళ్లు బావా! వెళ్ళి నీపని చూసుకో !

శేఖర్ : అదేం కుదర్దు రమా! నాకు రావాల్సిందేదో - నా మొఖాన కొట్టే-మీకూ-మీ వంశానికీ గుడ్ బై కొట్టి వెళ్ళిపోతా!

రమ : బావా! ఏమిటా పిచ్చి ?

రాఘు : పిచ్చికాదమ్మా - మదం!

శేఖర్ : ఇస్తే యివ్వండి. లేకపోతే, నాదీ మీరే వుంచుకొని వులకండి!

రమ : బావా! నీ వింక వూరుకోవా ఏమిటి?

శేఖర్ : ఎల్లా వూరుకోమంటావ్?-నువ్వూ మీ నాన్నా అన్యాయంచేసింతర్వాత. మీ ముఖాలు చూడ్డానికే అసహ్యం!

రాఘు : శేఖర్! (కోపంలో మాటపెగల్లేదు. మనిషంతా వొణికిపోతూవుంటాడు)

రమ : నీకు మతిపోయిందా యేమిటి బావా!

(రాఘువయ్య పిచ్చికోపంలో వుద్రిక్తుడౌతున్నాడే కానీ, మాట పెగల్డంలేదు.)

రాఘు : నీకు పుట్టగతులుంటాయట్రా. పోరా వెధవా పో! నీ ముఖం చూస్తేనే పాపం! మళ్ళీ కన్పించకు.

రమ : నాన్నా! ......బావేదో వయస్సువేడికొద్దీ అనేస్తే - మీరూ....

శేఖర్ : పోతున్నాను. పోక యిక్కడేం చేస్తాను? ఇక మీకు కన్పిస్తే ఒట్టు (వెళ్ళిపోతుంటాడు)

రాఘు : ఆగు. ఓ సేపుండు. (లోపలికెళ్ళి ఒక సంచి తెచ్చి శేఖర్ కాళ్ళదగ్గిరేసి) ఇదిగో - యీ తీసుకెళ్ళు. అందులో మీ అమ్మ నాకు యిచ్చిన యిరవై వేల రూపాయల రొఖ్ఖం, సెభూములతాలూకు దస్తావేజులున్నాయి. (ఈ మాటలుకూడా సరిగా వినిపించుకోకుండా క్రిందపడిన సంచి తీసుకొని విసురుగా వెళ్ళిపోతాడు శేఖర్.)

రమ : బావా !

రాఘు : పోనీ రమా ! వెళ్ళిపోనీ ! (నిట్టూర్చి) నా చెల్లెలి కడుపున చెడబుట్టాడమ్మా ! ......వాడికి నేనేం అన్యాయం చేశాను? వాడినీ కన్నకొడుకులా పెంచాను. అందుకే కన్నకూతుర్ని యివ్వలేక పోతున్నానని అన్నాను. కుమార్ అక్కకూతురి కేం - చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఆ - చూడు రమా ! కుమార్ నీకు నచ్చాడా ?......వానిలా నీవూ నా మాటను కాదంటావా ?

రమ : (ఏడుపు దిగమ్రింగుతూ) నాన్నా ! (కావిలించు కొంటుంది)

రాఘు : ఏమిటమ్మా యిది ? (బాధగా రమ తండ్రిముఖం లోకి చూస్తుంది. రాఘునయ్య కన్నీరు తుడుస్తూ) ఏడవకమ్మా ! (రమ ఏదో చెప్పబోతుంది. మాట పెగిలి రాదు.) పర్వాలేదు. చెప్పమ్మా !

రమ : మ...ధూ...ను...ప్రేమించా !

రాఘు : ఆ !...మధూను ప్రేమించావా ?......ఎలా అడు గుతావమ్మా ? దూరమాలోచించావా ? మధు కుల మొక్కడ, మన కుల మొక్కడ ? ఏటికి ఎదురీత వద్దమ్మా ! ఇలాంటివి మన యింటా-వంటా జరగ లేదు. నిప్పులాంటి కులానికి మచ్చ తెస్తావా ? మధు వలన నీకు కలగబోయే సంతానం ఏ కులాని కెక్కు తారు ? అభం-శుభం తెలియని నీ బిడ్డల్ని చూసి,

ఏవగించుకొని, కులంలేని పిల్లలని ముద్రవేస్తారే-యీ లోకులు.

రమ : నాన్నా! ......(గంభీరంగా) నేను చేస్తున్నపని సాంఘీకంగా తప్పని నాకు తెల్సు. అభ్యుదయ ప్రగతిని చూచి ఆనందించలేని స్వార్థ సమాజమిది. అయినా సమాజం చాలా మారింది. మారుతూంది. తొలుత సమాజ అంగీకారంతోనే బాల్యవివాహాలు చేయడం మానేశారా? అలాగే, అమానుష సతీ సహగమనం సమసిపోలేదా?...సంఘంలో ఏదీ కలకాలం నిలువదు నాన్నా!...మధు నావాడయితే లోకం ఏకమౌతుంది. నన్ను సాంఘీకంగా బహిష్కరిస్తుంది. ఏదిఏమైనా,...

రాఘు : మధూను మర్చిపోలేనంటావ్? అంతేనా? ఇది మనసు పసువు తక్కువమ్మా! నా మాట విను. ఈ కళంకం మన వంశం పొడుగునా నిల్చిపోతుందనే - నా బాధ!

రమ : నాన్నా! (ఏడుస్తుంది)

రాఘు : ఏడవకమ్మా! ఇప్పుడొచ్చిన తొందరేమీ లేదు. బాగా ఆలోచించి నీ నిర్ణయం చెప్పు. (బాధగా బ్యాగు తీసుకొని లోపలికెళ్ళిపోతాడు. రమ దిగులుగా సోఫాలో పడుకొని కళ్ళుమూసుకొని వుంటుంది. పోస్టుమన్ ప్రవేశించి 'పోస్టు' అంటాడు. రమనిద్రపోతూవుందనితలచిబిగ్గరగా'పోస్ట్' అంటాడు. ఈ అరుపుకు రమ కళ్ళువిప్పి చూస్తుంది. పోస్టుమన్

రమకు కవరందించి వెళ్ళిపోతాడు. కవరుపై దస్తూరి చూడగానే రమముఖం విప్పారుతుంది. కవరు చింపుతూ) 'మధు మద్రాసునుండి వ్రాసిందే!' (చించిన కవరులోనుండి లేఖను బయటకు తీసి) రమా! క్షమించలేని తప్పుచేస్తున్నాను. (ఆశ్చర్యంగా లేచి నిల్చుంటుంది. ఆ లేఖ తెరలోపల నుండి వినిపిస్తుంది.)

తెరలో మధు } రమా! నేను క్షమించలేని తప్పుచేస్తున్నాను. క్షమించమని అడగలేను. కానీ, నన్ను క్షమించు. మన పెళ్ళివిషయం అన్నయ్యను అడగలేను. అంత చనువూ, ధైర్యమూ నాలో లేవు. నీతో నా పెళ్ళికి మా అన్నయ్య వొప్పుకోడు. కారణం? – మన కులాలు వేరు. ఆయన్ను కాదని నేను తెగించలేను ......మన బ్రతుకులు బాగుపడాలంటే – మనం ఒకర్నొకరం మర్చిపోవాలి. నేను అన్నీ ఆలోచించి, నీ బాగు కోరే యీ నిర్ణయానికొచ్చాను...నిన్ను దగాచేశాననుకోకు. గతాన్ని మర్చిపో! కనీసం ప్రయత్నించి మరెవరినైనా...అర్థమైందా?

రమ : ... మధు. (రమ నిరాశలో నిలువరించిపోతుంది. మరొకమారు ఆ లేఖను తనలో చదువుకొంటుంది. చదివేప్పుడు రమ పెదాలు కంపిస్తుంటాయ్. అప్పుడే రాఘవయ్య ప్రవేశిస్తాడు. రమ చేతుల్లోవున్న ఉత్తరంలో ముఖం దాచుకొంటుంది. రాఘవయ్య ఆశ్చర్యపోయి ఆదుర్దాగా రమను సమీపించి—)

రాఘు : ఏమిటమ్మా-ఏమైంది......ఏమిటిదంతా? (ముఖం మీదున్న రమ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొంటాడు. రమచేతుల్లోని ఉత్తరం చూసి దాన్నందుకొని) ఏమిటమ్మా యిది? ఎవరు వ్రాసింది? (రమ తండ్రిఅక్కున చేరుతుంది.) నీవలా కూర్చో! (రమను కుర్చీలో కూర్చోబెట్టి ఆ ఉత్తరమంతా చదివి) మనిషిచాటుమనిషి గాంభీర్యం యింతేనమ్మా!

రమ : (లేస్తూ) మధుమనసు నాకు బాగా తెలుసు.

రాఘు : అయితే, యిలా ఎందుకు వ్రాశాడంటావ్? మగవారి మాయలు నీకు తెలీవమ్మా! తన అన్నయ్య మాటను కాదనే తెగింపేవుంటే-యిలా వ్రాస్తాడా? నీ పిచ్చిగానీ, యిలాంటి పిరికివాణ్ణి కట్టుకొని నీవేం సుఖిస్తావో చెప్పు? ఆ మూడుముళ్ళూపడి, మోజులు తీరాక – నీ గతికి నిన్ను వదలడని హామీ ఏమిటి? అప్పుడు నీ గతేం కావాలి!

రమ : నాన్నా! నా బాధను అర్థంచేసుకోండి!

రాఘు : ఎంత అమాయకురాలవమ్మా! నీకు యింకా కను విప్పు కాలేదా? అంత తేలికగా తిరస్కరించిన మధూపై నీకింకా మనసు చావలేదా? నా మాట విను. జరిగింది మర్చిపో! జరిగిందానికీ, అయిందానికీ విచారించక – నా మాటా కాదనక కుమార్‌ని కట్టుకో!

రమ : నాన్నా !...... నాకు పెళ్ళొద్దు. ఇలా వుండి పోతా !

రాఘు : ఆ !

రమ : నిజం నాన్నా !

రాఘు : ఈడొచ్చినపిల్లవు. ఇంకా యింట్లో ఎంతకాలం వుంటావమ్మా ! లోకులు ఏమంటారు చెప్పు ? ఆడది మగని అండలేనిదే......

రమ : జీవించలేదా నాన్నా ?

రాఘు : అవునమ్మా ! ఒంటరిస్త్రీని చూసి లోకులు వూరుకోరు. వంశమర్యాద కాపాడవలసిన బాధ్యత నీ చేతుల్లో వుందమ్మా ! (రమకు ఏం జవాబివ్వాలో తోచక డోలాయమానంలో పడ్తుంది. రాఘువయ్య రమ రెండుచేతులూ పట్టుకొని ప్రాధేయపూర్వకంగా రమ కళ్ళల్లోకి చూస్తాడు. రమ చలించిపోతుంది. తండ్రి చేతులవైపు ముఖంలోకి చూసి)

రమ : నాన్నా ! (ఏడుస్తూ తండ్రి కౌగిట్లోకి చేరి) ఇక మీ యిష్టం. (రాఘువయ్య ఆనందంతో రమతల నిమురుతూవుండగా తెర)

---

# అనుబంధాలు

## రెండవ రంగం

[జస్టిస్ ఉమాకాంత్ భవనంలో మధ్యహాలు. హాలులోనుండి లోపలికెళ్ళడానికి తలుపులుంటాయి, ద్వారానికి ప్రింటెడ్ తెర వుంటుంది.

హాలుమధ్య టీపాయి, ఎదురుగా రెండుమూడు కుర్చీలు, యిరు ప్రక్కల కుషన్ కుర్చీలుంటాయి. గుమ్మానికి ఎడమవైపు గోడ నాను కొని ఒక టేబిల్. దానిముందొక కుర్చీ వుంటుంది. టేబిల్‌మీద రేడియో, రేడియోమీద విద్యాసాగర్, రమ, మధుల ఫొటోస్టాండులుంటాయి. ద్వారానికి కుడిప్రక్కగా గాంధి, పైన బుద్ధుడు, ఎడమప్రక్క క్రీస్తుఫొటోలు తగిలించబడివుంటాయి,

రంగస్థలంలో కుడిప్రక్కగా ఒక మంచం, దానిమీద పడక పర్చి వుంటుంది. మంచంప్రక్కనే ఒక ఎత్తుస్టూలుమీద టెలిఫోనుంటుంది. మంచానికి తలాపున మరొక ఎత్తుస్టూలుమీద అందాన్నీ, పవిత్రతనూ సంతరించుకొన్న చలువరాతి బుద్ధవిగ్రహముంటుంది. హాలుకు ఎడమ వైపున మరొక ఎత్తుస్టూలుమీద శివ - పార్వతుల చలువరాతి విగ్రహముంటుంది,

తెర లేవగానే నౌకరు సుబ్బయ్య గదిని శుభ్రపరుస్తుంటాడు. మధు చేతిలో సూట్‌కేసుతో టక-టక బూట్లచప్పుడు చేసుకొంటూ ప్రవేశిస్తాడు. వెంట కూలీ హోల్డాలు, పండ్లబుట్ట తెచ్చి అక్కడపెట్టి, మధు యిచ్చింది తీసుకొని వెళ్ళిపోతాడు. సుబ్బయ్య మధువైపు 'ఎవరా' అని పరికించి చూస్తుంటాడు.]

మధు : (చిరునవ్వుతో) అలా చూస్తావేం సుబ్బయ్యా! నేను - పోల్చలేక పోతున్నావా ?-మధూను!

సుబ్బ : ఆ-మీరా బాబూ! (విచారంతో ముఖం నల్లబడు తుంది)

మధు : సుబ్బయ్యా!

సుబ్బ : ఊఁ!

మధు : అలా వున్నావేం ?

సుబ్బ : ఎలా వున్నాను బాబూ ?

మధు : బాధపడుతున్నట్టు.

సుబ్బ : లేదే!

మధు : ఒంట్లో బాగా లేదా ?

సుబ్బ : బాగానే వుంది.

మధు : అయితే, ముఖం అలా పాలిపోయిందేం ?

సుబ్బ : నాకేం బాబూ, దుక్కలాగుంటేను.

మధు : (నవ్వుతూ) అబద్ధాలాడేందుకూ కూడ అలవాటుబం డాలి. (సుబ్బయ్య కళ్ళొత్తుకోవటం చూసి) సుబ్బ య్యా! నిజం చెప్పు! నీవేదో దాస్తున్నావ్!...ఓ! I see! నేను ఫారెన్ పోతున్నాననేగా-నీ బాధ ?

సుబ్బ : అవును బాబూ! అంతే! అంతే!

మధు : నీకూ రమకూ యిష్టమైతేనే - నేను ఫారెన్ పోతా! చెప్పు సుబ్బయ్యా! మీ కష్టంలేకపోతే మానేస్తా! ...ఆ-సుబ్బయ్యా! నీకు తెల్సా, రమ ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది.... పలకవేం ?

సుబ్బ : (విచారంగా) తెలియకేం బాబూ!

మధు : చూడు. నాకు ఆకలిగావుంది. ముందు పాలుతీసుకురా! (సుబ్బయ్య లోనికెళ్తాడు. మధు బూట్లువిప్పి రేడియో ఆన్‌చేసి వచ్చి కుషన్‌కుర్చీలో కూర్చొని టీపాయిమీదున్న పేపరు తీస్తాడు. పేపరు తీసేప్పుడు టీపాయ్ మీదున్న కవరు క్రిందపడుతుంది. మధు క్రిందికి వొంగి ఆ కవరందుకొని, లోపలున్న పెండ్లిపత్రిక తీసిచూసి అదిరిపడి లేస్తాడు. రేడియో నుండి హృదయవిదారకంగా సంగీతం వస్తూవుంటుంది.) రమాదేవి బి.ఎస్‌సి. విత్ కుమార్ ఎం.ఎ. ఆ! (ఆదుర్దాగా అంతా చదువుతాడు. ముఖంలో నీలితెర లావరించడంలో మనిషంతా నీరసించి పోతాడు. పెదవులు వణుకుతుంటాయి. మనిషంతా కంపరంలో తడబడుతూ వూగిపోతూ ఒకచోట నిలవలేక అటు-యిటు తిరుగుతూ) కుమార్‌తో రమ పెళ్ళి జరిగిందా? నేను నమ్మను. నమ్మలేను. (మళ్ళీ పత్రిక చూస్తాడు. బాధ క్రుంగదీస్తుంది. పిచ్చివానిలా ఏమిటో అటు-యిటు తిరుగుతాడు. పుస్తకం తీసి చదవబోతాడు. మనస్కరించక అక్కడే పడేస్తాడు. రేడియోనుండి వచ్చేసంగీతం మధూను మరీ బాధిస్తుంది. వెళ్ళి రేడియో ఆపి చేతుల్లో ముఖం దాచుకొంటాడు. లోపలినుండి పాలు తీసుకొనివచ్చిన సుబ్బయ్య మధూను చూసి చకితుడై — పాలగ్లాసు టీపాయిమీద పెట్టి –

సుబ్బ : బాబూ! (మధుముఖంమీదనుండి చేతులు తీ

సుబ్బయ్య రెండుబుజాలూ పట్టుకొని ఏదో అడగ బోతాడు. మాట పెగలదు) ఎందుకలా బాధపడు తున్నావు.

మధు : నాకు మిగిలింది బాధేగా! ... రమ దూరమైంది. ఇక వెళ్ళిపోతుంది.ఎందుకీ వ్యర్థజీవితం, ఎవరికోసం యీ బ్రతుకు?

సుబ్బ : బాబూ! .... మన జన్మకు అర్థంవుంది-ప్రయో జనం వుంది. అది తెల్సుకోడానికే మనం జీవించాలి బాబూ! .... హు! పాడు చాప్తుల్లో ఏముంది?

మధు : అంతా అయిపోయింది. ఇక (నిరాశతో) ఏమీ లేదు.

సుబ్బ : దేనికి లేదు బాబూ? చాలావుంది. మీరు పెళ్ళి చేసుకోవాలి. పండంటి బిడ్డలకు ....

మధు : (విసుగుతో వినలేక) తండ్రిని కావాలి. అంతేనా?... (కృంగిపోతూ) అంత అదృష్టానికి నోచుకోలేదు నేను.

సుబ్బ : మరి మీ యింటిపేరు నిలిచే దెలా?

మధు : (బాధగా) సుబ్బయ్యా! ఏమిటి నీ గొడవ? ...... రమ యింకా యిక్కడే వుందా?

సుబ్బ : ఉంది బాబూ!

మధు : పెళ్ళి బాగా జరిగిందా?

సుబ్బ : (విచారంగా) జరిగిపోయింది బాబూ! జరిగిపో యింది...రమమ్మ మునుపటిలా లేదు. బాగా సన్న గిల్లిపోయింది. పెళ్ళిపీటలల్లోని రమమ్మ నన్నుచూసి

ఏడుస్తుంటే......నాకూ ఏడుపొగిందికాదు. (గొంతు జీరపోతుంది)

మధు : ఎందుకు ఏడుస్తుంది? కుమార్‌తో రమ పెళ్ళి రమ యిష్టంతోనేగా జరిగింది.

సుబ్బ : (మధు మనస్థితిచూసి నిట్టూర్చి) పాలు చల్లారిపోతు న్నాయి బాబూ!

మధు : అవసరంలేదు. నీ వెళ్ళు!

సుబ్బ : ఆకలిగా వుందన్నారు, తీసుకోండి బాబూ!

మధు : (విసుగుతో విసురుగా) నాకేం బాగాలేదు. నీకొకదూ చెప్పేది?...నీవెళ్ళు. ఊ- వెళ్ళవేం?

సుబ్బ : అహ అలా వీల్లేదు.

మధు : అబ్బబ్బ. మీరంతాచేరి నన్ను చంపుకతింటు న్నారు. ఛీ! వెధవబ్రతుకు.

సుబ్బ : (కన్నీళ్ళుపెట్టుకొని) మీకంత బాధగావుంటే- నేవెళుతున్నాలే బాబూ! (వెళ్ళిపోతూవుంటాడు)

మధు : (వెళ్ళే సుబ్బయ్య వేపు దీనంగా చూచి)సుబ్బయ్యా! ...ఇదిగో- యిలారా! (సుబ్బయ్య వస్తాడు) నిన్ను బాధపెట్టానుకదూ! (కుములుతూ) ఏంచెయ్య మంటావ్? నేను నా చేతుల్లో లేను.

సుబ్బ : లేదు బాబూ! మీబాధ తెల్సుకోకుండా- నేనే మిమ్మల్ని బాధపెట్టాను.

మధు : సుబ్బయ్యా! నేను వెళ్ళి రమనూ- కుమార్‌ని చూడాలి. నీవీపని చేసిపెట్టు! (జేబులోనుండి పర్సు తీసియిస్తూ) నీవు బజారుకెళ్ళి మంచి చీరా రవికా-

పసుపు కుంకుమ, పూలు పండ్లు...(మాటలు పెగిలి రాక గొంతు జీరపోతుంది. బాధగా ముఖం ప్రక్కకు త్రిప్పేస్తాడు.)

సుబ్బ : బాబూ!

మధు : నీవెళ్ళి అవి తీసుకరా పో! (సుబ్బయ్య బయటికెళ్ళి పోతాడు. మధు రేడియో ట్యూన్‌చేసి- రేడియో మీదున్న రమఫోటోను చూస్తాడు. ముఖం ముడు చుకపోతుంది. బాధగా రేడియోఆపి రమఫోటో తీసు కొని మంచంమీద వాలిపోతాడు. రమ ప్రవేశించి మధూనుచూసి అక్కడే ఆగిపోతుంది. మధు రమ ఫోటోనుచూస్తూ-) నన్ను అన్యాయంచేసి వెళ్ళి పోతున్నావా రమా!

రమ : (అలలు అలలుగా పొంగి పొరలివచ్చే ఏడుపును నోట్లో పైటచెరగు పెట్టుకొని ఆపుకో ప్రయత్నిస్తూ) మధూ!

మధు : (చకితుడై వెనుతిరిగి చూస్తాడు)

రమ : (ఏదో మాట్లాడబోతుంది)

మధు : (నీవేమీ మాట్లాడకన్నట్టు ముఖం విసుకుగా అటు త్రిప్పుకొంటాడు)

రమ : మధూ!

మధు : నీ విలా వస్తావనుకోలా! ఎండమావిలా నమ్మించి నన్నిలా వంచన ...

రమ : ఆ! వంచనా! !

మధు : అవును...తప్పంతా నాదే! నాసర్వస్వం నీకర్పించ

డనే నా తెలివితక్కువ. నీది ప్రేమకాదు. పచ్చి నటన.

రమ : ఆ! నటనా!!

మధు : అవును . . . రమా! ఇటుచూడు! ఆ రోజుల్లో నీవు 'మధూ! నేను నీ చరణదాసినై నిన్నలరిస్తూ నీ ఆదరణలో ఆనందిస్తాను. దైవసాక్షిగా నాసర్వస్వం నీవే! నీతోనే నా జీవితం' అని అనలేదా? అవన్నీ జ్ఞాపకం లేవా రమా?

రమ : అవన్నీ మర్చిపో మధూ!

మధు : చెప్పనీ రమా! "మధూ! నాకు యిహం- పరం నీతోనే! నన్ను పాలముంచినా- నీటముంచినా నీవే" నని ప్రమాణాలుచేసి- నాచే నీవూ చేయించుకో లేదా? ఆనాటి నీమాటలు ఏమయ్యాయ్? - నీటి మూటలయ్యాయ్- అవునా?

రమ : మధూ! . . . ఆవేశపడకు! నిజంగా నన్ను నీవు ప్రేమించావా?

మధు : హు! ఎందుకు నీకీ సందేహం? . . . నిన్ను నమ్మాను. మనసిచ్చాను. కానీ, నీవు నన్నొక ఆట బొమ్మగా ఆడించాలనుకొన్నావ్- ఆడించావ్!

రమ : మన ఎడబాటుకు కారకురాల్ని నేనా?

మధు : ఇంకెవరు?- నీవుకాదా?

రమ : ఆ!

మధు : ఏం? ఎందుకలా ఆశ్చర్యపోతావ్?

రమ : నీచేతులారా నీవు చేసుకొని- ఇప్పుడు నన్నని ఏం లాభం?

మధు : ఆ! ఏమన్నావ్? నాచేతులారా చేసుకొన్నానా!

రమ : అవును. (చేతిలోని వుత్తరం చూపిస్తూ) ఆనాడు నీ వీ లెటర్ వ్రాయకపోతే-. . .

మధు : నేను నీకేం వ్రాశాను?

రమ : అయితే, యిది వ్రాసిందెవరు? నీవుకాదా?

మధు : (రమనుండి ఆవుత్తరాన్ని లాక్కొని చూస్తూ వుండగా తెరలో-)

తెరలో : రమా!

నేను క్షమించలేని తప్పు చేస్తున్నాను. క్షమించమని అడగలేను. కానీ, నన్ను క్షమించు. మన పెళ్ళివిషయం అన్నయ్యను అడగలేను. అంత చనువూ, ధైర్యమూ నాలో లేవు. నీతో నాపెళ్ళికి మా అన్నయ్య వొప్పుకోడు. కారణం?- మన కులాలు వేరు. ఆయన్నుకాదని నేను తెగించలేను. . . . మన బ్రతుకులు బాగుపడాలంటే - మనం ఒకర్నొకరం మర్చిపోవాలి. నేను అన్నీ ఆలోచించి,నీబాగు కోరే యీ నిర్ణయానికొచ్చాను . . . నిన్ను దగాచేశానను కోకు. గతాన్ని మర్చిపో! కనీసం ప్రయత్నించి మరెవరినైనా .......అర్థమైందా ?

మధు : . . . . . . మధు (తెరలో వికటాట్టహాసంతో హాలంతా ప్రతిధ్వనిస్తుంది. మధూకు ఏమీ అర్థం గాక అయోమయంగా రమవేపు చూస్తాడు. రమ

కూడా అదే అవస్థలోవుంటుంది. మధు ఎలాగో తమాయించుకొని-) ఎంత మోసం ! ... నేను వ్రాసింది కాదిది.

రమ : ఎందుకు మధూ నీ మనస్సును మభ్యపెట్టు కొంటావ్ ?

మధు : నిజం రమా ! నీవు నమ్మి నమ్మకపో ! దైవసాక్షిగా నాకేం తెలీదు.

రమ : (ఏడుపును దిగమ్రింగుతూ) నీ...నీవు...వ్రాసింది కాదా ?

మధు : (తనధోరణిలో) అవును రమా ! ఎవరు, ఎందుకు యిలా వ్రాశారో నా కర్థంకాకుండావుంది.

రమ : మధూ ! (తలబాదుకొంటుంది)

మధు : (రమవైపుచూసి చకితుడై) రమా !

రమ : (ఏడుస్తూ) ఈ జాబును నమ్మి నిన్ను అన్యాయం చేశాను. నా కిక నిష్కృతిలేదు.

మధు : నీవూ నాకు కాకుండాపోయావ్ ! నా జీవితం పెను చీకటయింది. నాలో జీవితేచ్ఛ నశించింది రమా !

రమ : మధూ !

మధు : అవును రమా ! నా కెందుకు యింకా యీ బాధా మయబ్రతుకు ? ... శాశ్వతంగా నిద్రించడానికీ - నిర్మలమైనదీ...చావేగా !

రమ : (త్రుళ్ళిపడి) ఆ ! - (వెకిలినవ్వునవ్వి) కష్టసుఖాలు మనకురాక మాకులకొస్తాయా ?

మధు : ఏం చేయనుంటావ్ రమా ? ఇద్దరమూ విధి

చేతిలో ... (మాటలు పెగిలిరాక గొంతు జీర పోతుంది) నిజం తెల్సింది. నీవైనా సుఖపడుతా వనుకోను.

రమ : (నిట్టూర్చి) వెలుగునీడలు విడదీయని జంటలు మధూ ! వెలుగున్న చోటే నీడా వుంటుంది. (విచారంగా) ఈ బాధను మనం భరించక తప్పదు.

మధు : గతాన్ని మర్చిపో రమా ! (విచారంగా ముఖం అటువైపుకు త్రిప్పుకొని) ఇక నా స్థానంలో కుమార్‌ని నిలుపుకో !

రమ : నీవూ మనసు మార్చుకొని పెళ్ళిచేసుకో మధూ !

మధు : ఆ ! నాకు పెళ్ళా ! (వెఱ్ఱిగానవ్వి, విపరీతంగా బాధపడి ఫిట్‌లో పడిపోతాడు. రమ కంగారుపడి ఏమి చేయడానికీ తోచక ఏడుస్తుంది. తరువాత వెళ్ళి నీళ్ళు తెచ్చి మధుముఖంమీద చల్లుతుంది. మధు బాధతో తలపట్టుకొని లేచి కూర్చుంటాడు. మధు నొసటినుండి చేయితీయగానే బొటబొట రక్తం కారుతుంది. నీళ్ళగ్లాసు పెట్టేందుకు వెనుతిరిగిన రమ యిటు తిరిగిచూసి)

రమ : ఆ ! రక్తం !! (గబగబ పైటచెరగు చించి మధు నుదుటికికట్టుకట్టి సాయంపట్టి మధూను లేవదీస్తుంది.)

మధు: (రమ కంగారుచూసి) అంతిమఘడియ లనుకొన్నావా రమా ?...హు ! చావుకూ నేనంటే అసహ్యం ! నీ వొడిలో నేను చావగలిగి...

రమ : (బాధగా) మధూ! (బాధను దిగమింగి) ఏం జరిగింది?

మధు : ఏంలేదు రమా!

రమ : ఎందుకు దాస్తావు మధూ? నిజం చెప్పకపోతే - నన్ను చంపుకుతిన్నంత...

మధు : (మందలింపుస్వరంతో) రమా! అలా నాకై నీ మీద ఒట్టుపెట్టుకోవడం నీ శ్రేయస్సుకు శుభం కాదు...నాకు ఫిక్సు రావడం యిదే మొదలు. కారణం - ఎక్కువగా బాధపడ్డమేననుకొంటా!

రమ : త్వరగా చికిత్సచేసుకో మధూ!

మధు : జీవించాలని నాకు లేనప్పుడు - యింకా చికిత్సెందుకు రమా?

రమ : బ్రతుకుమీద నీ కెందు కింత అసహ్యం? (చేయి చాపి)నాకు నీవు పెళ్ళిచేసుకొంటానని మాటివ్వాలి!

మధు : ఎవర్ని(పేలవంగా నవ్వి రమను సూటిగా చూస్తూ) నిన్నేనా?

రమ : (తొణక్కుండా) నన్ను కాదు. నీ కిష్టమైనవారినే!

మధు : (రమను సూటిగా చూస్తూ) నా కిష్టమైనదానవు నీవేగా!

రమ : (ముఖం అటు త్రిప్పుకొని ఏడుస్తుంది.)

మధు : ఏమిటి రమా? ఏడుస్తున్నావా?

రమ : ఏడవక ఏంచెయ్యను?

మధు : రమా!...నన్ను పెళ్ళిచేసుకోమనే కోరుతున్నావా?

రమ : అంతకంటే నన్ను కోరేదేముంది మధూ?

మధు : పోనీ, రోజు కొకమారైనా - నన్ను తల్చుకో కుండా వుండగలవా ?

రమ : అదెలా సాధ్యం ?

మధు : ఇదీ అంతే! మనం ఏమైనా - నా మనసుమారదు. నీవు నాకు పరస్త్రీవి కనుక నీపై ప్రేమను చంపుకో గలను. కాని - (ఏమిటన్నట్లు రమ తలపైకెత్తి మధూని చూస్తుంది. అప్పుడే సుబ్బయ్య చేతిలో పార్సెళ్ళతో లోపలి కెళ్ళిపోతాడు) ఆత్మవంచన చేసు కొని నీలా...

రమ : అర్థమయింది మధూ!...చస్తూ బ్రతుకుతున్నాను నేను. ఇంకా ఎందుకు చంపుతావ్ ? నామాట విను. నిన్ను నీవు బాధపెట్టుకొంటూ - నన్నూ ఎందుకు బాధిస్తావ్ ?

మధు : పెళ్ళిచేసుకొని నేనూ సుఖించలేను. చేసుకొన్న వారినీ సుఖపెట్టలేను రమా ! జీవితమంతా ఆమెతో ఎలా నటించమంటావ్ ? నన్నిలా బ్రతకనీ !

రమ : నాకు తెలుసు నీ మనసు. నీ బ్రతుకంతా మనశ్శాంతి లేకుండా చేశాను. నేను మహాపాపిని మధూ ! మహా పా...పి...(ఏడ్చేస్తుంది.)

మధు : (ఏడ్చే రమనుచూసి తనవిచారాన్ని ఆపుకొంటూ) రమా !...ఏడుస్తావెందుకు ?... ఏడవకు. (జీర పోతుంది.)

రమ : (అంత బాధలోనూ అదోమాదిరి నవ్వి) నన్ను ఏడవద్దంటూ నువ్వేడుస్తున్నావేం మధూ ?

మధు : (తన బలహీనతని రమ ఎత్తిచూపేసరికి మధు యిద్దైపోతాడు. ఆ కంగారును దాచిపెట్ట ప్రయత్నిస్తూ—) ఆనాడు నీ సర్వస్వం నేనే! ఇప్పుడు నేను నీకు ఏమీకాను - పరపురుషుణ్ణి! నన్ను నీవు తల్చుకోరాని అదృష్టహీనుణ్ణి రమా! నీ పెళ్ళితో మన 'అనుబంధాలు'...

రమ : (ఏడుస్తూ) తెగిపోయాయా?

మధు : (ఏడ్చే రమనుచూసి) బాధ కలిగించానా? నేను బలహీనుణ్ణి. ఏదైనే అనకూడదో ... ఎందుకులే! ఆ - రమా! ఇటుచూడు. కులసతిధర్మం పతి సేవేనని నీకూ తెల్సు. సతీత్వాన్ని కోల్పోతే హిందూ స్త్రీకి సుఖంలేదు రమా! ఎలాంటి అరమరికలూ లేక నీవూ - కుమార్ అన్యోన్యంగావుంటేనే - నాకు ఆనందం. అలా నిల్చున్నావేం? కూర్చో రమా! ఇప్పుడే వస్తా! (మధు లోపలికి వెళ్ళిపోతాడు. రమ ఎడమవైపు కుషన్ కుర్చీలో కూర్చొని చేతుల్లో ముఖం దాచుకొంటుంది. బయట కారాగిన చప్పుడు, కొద్దివిరామంలో **విద్యాసాగర్** చేతిలో సూట్ కేసుతో ప్రవేశిస్తాడు. రమ **విద్యాసాగర్** రాకను గమనించదు. రమను చూసి **విద్యాసాగర్** రమవెనుక నిలబడి—

**విద్యా** : చెల్లాయ్! (రమ లేచి నిలబడి వెనుతిరిగి చూస్తుంది) ఏడుస్తున్నావా?

రమ : నీవా అన్నాయ్!

విద్యా : (రమను సమీపించి) బాధపడకమ్మా! (కన్నీరు తుడుస్తూ ఏగో చెప్పబోతాడు.)

రమ : అంతా తారుమారయింది. నా సంపూర్ణ అర్పణ....

విద్యా : అంతా తెల్సింది రమా! సమయానికి నేనూ లేక పోయాను. విధి మీ నుదుట . . . (మాటలు పెగ లవు. తరువాత సూట్ కేసు తెరిచి, రెండు ప్యాకెట్లు బయటకుతీసి రమకు చూపిస్తూ) ఎలా వున్నాయ్ రమా!

రమ : బాగున్నాయ్! ఎవరికివ్వాలని? రాబోయే నా వదినకా?

విద్యా : కాదు. నీకే! నీకు పెళ్ళికానుకలుగా యివ్వాలని కొన్నాను. బావను ఒప్పించి, మధూతో నీ పెళ్ళి జరిపించాలని బావను వెంటబెట్టుకొచ్చాను. కానీ . . . (మాట్లాడలేకపోతాడు.) నీ పెళ్ళి ఎవరితో అయినా – యివి నీ సొత్తులమ్మా!

రమ : ఎందుకులే అన్నాయ్!

విద్యా : కాదనకమ్మా! నీకంటే నా కెవరున్నారు చెప్పు? అటు తిరుగమ్మా! (రమ అటు తిరుగుతుంది. రమ మెళ్ళో రాళ్ళనెక్లెస్ వేసి) ఇక యిటు! (రమ యిటు తిరగ్గానే రమ రెండుచేతులకు గాజులు తొడిగి, రమను చూసి) చెల్లాయ్! (రమ ఆత్మీయతతో ముందుకు వస్తుంది.) ఈ యింటి సుహాలక్ష్మివను కొన్నా! మన 'అనుబంధాలు' యిలా . . .

రమ : అన్నాయ్! (విద్యాసాగర్ నోటికి చెయ్యి అడ్డం పెట్టుంది.

మధు : (అప్పుడే ప్రవేశించి యీ సన్నివేశం చూసి, విని–) అన్నాచెల్లెలు కష్టసుఖాలు చెప్పుకుంటున్నారా? (ప్రక్కనేవున్న బుద్ధభగవానుని విగ్రహంమీద వేసి) భగవాన్! ఏనాటిది వీరి అనుబంధం!

విద్యా : (మధూను సమీపించి మధుచేయి నొక్కుతూ) తలకు ఆ కట్టేమిటి మధూ?

మధు : తర్వాత చెప్తాలే! అన్నయ్య రాగున్నాడా?

విద్యా : బావకూడా వచ్చాడు.

మధు : అయితే ఏడీ?

విద్యా : ప్లీడర్ రామారావింటి కెళ్ళాడు.(సుబ్బయ్య ప్రవేశిస్తాడు. చేతిలో ఒక పళ్ళేరముంటుంది. పళ్ళేరంలో చీర, రవిక, పూలు, పండ్లు, పసుపు, కుంకుమ, కొంకాయ వుంటాయి. తెచ్చిన పళ్ళేరాన్ని టీపాయి మీద పెడ్తాడు.) నీకు కుమార్ కనిపించాడా?

మధు : లేదు. నేనూ యిప్పుడే వచ్చాను.

విద్యా : నాకు కనిపించి మాట్లాడేడు. మనమిద్దరమూ పెండ్లిసమయానికి యిక్కడలేమని కుమార్ చాలా నిష్ఠూరం చేశాక్ళే! (సుబ్బయ్యతో) తాతా! ఇలా రా! ... బావొచ్చాడు. నీ వెళ్ళి వంట ప్రయత్నం చూడు.

సుబ్బ : అలాగే బాబూ!

విద్యా : చూడు మధూ! కుమార్ నిన్ను చూడాలంటు

న్నాను. నేను వెళ్ళి పిల్చుకొస్తా! వస్తానమ్మా!
(బయటికి వెళ్ళిపోతాడు.)

మధు: (శీసాయిమీదున్న పళ్ళెరాన్ని రమ కిస్తూ) ఇదంతా ఆడవాళ్ళు చూసుకోవాల్సింది. ఆడవాళ్ళుండే ప్రాప్తి యీ యింటికిలేదు రమా! ఊఁ – తీసుకో!

రమ : (ఒద్దని చేత్తో చెప్తూ) – పైటచెరగు నోటికడ్డంపెట్టు కొని ఏడుస్తుంది.)

మధు : కాదనకు రమా! నా ఆనందంకోసం స్వీకరించు! (రమ మధూను చూస్తుంది. మధు ప్రార్థేయపూర్వ కంగా) స్వీకరించవూ!

రమ : ఎందుకు మధూ యిదంతా? (రమ ఒడిపట్టుంది. మధు రమ ఒడిలో ఒక్కొక్కటే పెట్టాడు. ఒడి కొంగును నడుముకు చుట్టుకోబోతుంది. కొంగు జారిపోయి అన్నీ క్రిందపడిపోతాయి. ఇద్దరూ క్షణం నివ్వెరపడతారు. సుబ్బయ్య క్రిందపడినవాటిని పళ్ళె రంలోపెట్టి, దానిని మధూచేతికిస్తాడు. రమ ఒడి పట్టుంది. మధు అన్నింటినీ ఒడిలో పెట్టాడు. రమ జాగ్రత్తగా కొంగును నడుముకు చుట్టుకొని—) వెళ్ళొస్తా మధూ! (మధుపాదాలకు నమస్కరిస్తుంది)

మధు : ఏమిటిదంతా? ఛీ రమా! మరీ పిచ్చిదానవుకాకు. (లేవనెత్తి) తప్పుకదూ! నేను నీవనుకొన్నంత గొప్పవాణ్ణికాను రమా! (రమకన్నీరు తుడుస్తూ) నీవు శీలవతివి! కనుక, అనుక్షణం నీ భర్తముఖం లోకి ధైర్యంగా చూడగలవు. మీ దాంపత్యం

సవ్యంగా సాగిపోవాలనీ – మీకు ఆనందమయ భవిష్యత్తు నిమ్మనీ – నేను సత్యం భగవంతుని ప్రార్థిస్తుంటాను. (నిట్టూర్చి) వెళ్ళిరా రమా!

రమ : (సుబ్బయ్య దగ్గరకెళ్ళి) వస్తాను తాతా! (సుబ్బయ్య పాదాలకు నమస్కరించబోతుంది –)

సుబ్బ : (మధ్యలోనే వారిస్తూ) వద్దుతల్లీ వద్దు... ఈ యింటి యిల్లాలుగా రావలసిన నీవు, ఆడబడుచులా పసుపు కుంకుమ తీసుకొనిపోతున్నావ్. వెళ్ళిరా తల్లీ – వెళ్ళిరా! (పైతుండుతో కళ్ళొత్తుకుంటాడు)

రమ : (వచ్చే ఆవేగాన్ని ఆపుకొంటూ) తాతా!...... వెళ్ళిరానా మధూ!

మధు : (విచారంగా) వెళ్ళిపోతున్నావా రమా! (చేతుల్లో ముఖం దాచుకొంటాడు. రమ బాధగా వెళ్ళిపోతుంది. మధు ముఖంమీదనుండి చేతులుతీసి చూసి –) రమా! (నిరాశగా) వెళ్ళిపోయావా? (మధుబాధను చూడలేక సుబ్బయ్య లోనికెళ్ళాడు) నా ఆశాజ్యోతి శాశ్వతంగా ఆరిపోయింది.

(సాయంకాలమైనందున బయట పశువుల కాపరుల అదిలింపులు, తల్లులకోసం లేదూడల అరుపులు, పిల్లల ఆటల కేరింతాలు – పీలగా విన్పిస్తుంటాయి. క్రమక్రమంగా హాలంతా చీకటవుతుంది. ఉమాకాంత్ ప్రవేశించి చీకటిలో ఏకాంతంగా కూర్చొనివున్న తమ్ముని చూసి –)

ఉమా : ఎవరూ! నువ్వా మధూ! మద్రాసునుండి ఎప్పు డొచ్చావ్?

మధు : మీరా అన్నయ్యా! నేనూ యీ వేళే వచ్చాను.

ఉమా : చీకటిలో కూర్చున్నావేం? ఈ యింట్లో దీపం లేదా?

మధు : నిన్నే ఆరిపోయింది. మళ్ళీ వెలుగుతుందనే ఆశే లేదు.

ఉమా : (స్విచ్ వేస్తాడు. వెలుగొస్తుంది.) ఈ వేదాంతం ఎప్పటినుండి?... ఆ! ఆ కట్టేమిటి మధూ? (మధు కూరంగా తలొంచుకొంటాడు) ఏమిట్రా యిదంతా?

మధు : (బాధగా) అన్నయ్యా!

ఉమా : అరే - ఏడుస్తున్నావా? ... ఏంజరిగింది? చెప్పరా, చెప్పు? నాకు కాకపోతే మరెవరికి చెప్తావ్? నాకు నీవు, మనిద్దరికీ విద్యాసాగర్ తప్ప - మన కెవరున్నారు? అందరూ మనల్ని విడచిపెట్టి పోయార్రా!

మధు : (బాధగా) అన్నయ్యా!

ఉమా : ఏమిటి నీబాధ? నేను వినకూడదా? (అంటూ చేతిలోవున్న పుస్తకాన్ని టీపాయిమీద వేస్తాడు. పుస్తకంపడిన పదునుకు, టీపాయిమీదున్న కాగితం క్రిందపడుతుంది. ఉమాకాంత్ దాన్నందుకొని చదివి -) ఇది నీవు వ్రాసిందేనా?

మధు : (అటుచూసి) అదా? ... కాదు. (నిట్టూర్చి) అదే నా బ్రతుకును ఎడారి చేసింది.

ఉమా : నీవనేది నా కర్థం కావడంలేదు. నీవు రమను ప్రేమించావా?

మధు : అవును.

ఉమా : రమా నిన్ను ప్రేమించిందిగా! ఇలా ఎందుకు వ్రాశావ్?

మధు : అది నేను వ్రాసిందికాదు.

ఉమా : మరెవరు వ్రాశారు?

మధు : ఏమో! అదే అర్థంకావడంలేదు.

ఉమా : ఇంతకాలం మీ ప్రేమసంగతి నాకెందుకు చెప్ప లేదు?

మధు : రమ B. Sc. పాసయ్యాక చెప్దామనుకొన్నా - ఇంతలో యీ మనసు మార్చుకోస్తుందనుకోలా!

ఉమా : మనచేతుల్లో ఏముందిరా! విధి బలీయమైనది.

మధు : బాధ అంతకంటే భరింపరానిది. శేషజీవితంలో నాకు వెన్నెలలేదు - సుఖంలేదు.

ఉమా : మధూ! నీవు చిన్నవాడివి. నీకు యింకా జీవితపు లోతులు తెలీవు. సుఖదుఃఖాలసంఘర్షణే బాబూ, జీవితం! చూడు, యీ జీవితాలున్నాయే - యివి అశాశ్వతాలు. అంతలో, ఎందుకీ జ్ఞాపకాలూ - బాధలూ? రమను మర్చిపో, నీవూ పెళ్ళిచేసుకో!

మధు : లేదన్నయ్యా! జీవితమంతా యిలాగే వుండిపోతా!

ఉమా : ఆ! వెనకా ముందూ చూడు. మంచీ చెడ్డా ఆలోచించు. నీతోనే మన వంశం నిలబడాలి.

మధు : అన్నయ్యా!

ఉమా : అవున్రా నాన్నా నిన్ను మా కప్పగించిపోయారు

అప్పటినుండి నేనూ మీ వదినా నిన్ను పెంచాం. నీవు యింటర్ చదివేరోజుల్లో నీ వదినా పోయింది.

మధు : వదినా! (వదినను తల్చుకొని కుమిలికుమిలి ఏడుస్తాడు.)

ఉమా : (తనధోరణిలో) పోనూ - నీకోసం నన్ను పెళ్ళి చేసుకోవద్దని, నిన్నూ, పెద్దదిక్కులేని తన తమ్ముడు విద్యాసాగర్‌ని...

మధు : (బాధగా) అన్నయ్యా! ఇప్పుడవన్నీ ఎందుకు?... నేను పెళ్ళిచేసుకోలేను. అది తప్ప మీరేది కోరినా...

ఉమా : ఇంతకంటే నిన్ను కోరేదేముందిరా? ఈ యింటి కళా కాంతి మీ వదినతో పోయిందిరా! నీ వొక యింటివాడవై ఈ యింటిని మళ్ళి దీపావళిలా చేస్తావనుకొన్నాను. (పేలవంగా నవ్వి) అంతా భ్రాంతి!

మధు : అది కాదన్నయ్యా!

ఉమా : ఏది కాదురా! రమ నుకేమీ కాదు. (మధు ఆశ్చర్యంగా ఉమాకాంత్ వైపు చూస్తాడు.) ఒక అనామకురాలు దూరమయిందని నీ విలా అన్నిటికీ దూరం కావడం...

మధు : అన్నయ్యా! ... రమ!! ... అనామకురాలా!!! కాదన్నయ్యా - కాదు. రమ నా హృదయారాధ్య దేవత. మా అర్పణ - ఆరాధన - అనుబంధాలు మీ కర్థం కావు ... పోనీ, మీరే మళ్ళి పెళ్ళిచేసుకొంటే___?

ఉమా : ఆ!

మధు : అవునన్నయ్యా! మీ కేమంత వయస్సుందని?

ఉమా : మధూ! ... ఈ మాటనడానికి నీకు నోరెలా వచ్చింది? ఇలా సాధించకపోతే - యింత విషమిన్వ రాదూ?

మధు : బాధ కలిగించానా అన్నయ్యా!

ఉమా : లేకపోతే ఏమి టా మాటలు?

మధు : పొరపాటయింది, క్షమించన్నయ్యా!

ఉమా : (క్షమాహృదయంతో మధూవైపుచూసి మాట మారుస్తూ) అది సరే, నీ ఫారిన్ ప్రయాణ మెప్పుడు?

మధు : నే నిక చదవలేను. నా తెలివితేటలన్నీ రమ వెంటే పోయాయి.

ఉమా : నీవు ఫారిన్ పోయి రిసెర్చిచేసి వంశానికీ, దేశానికీ కీర్తిప్రతిష్ఠలు తెస్తావనుకొన్నా. మన వంశీయులంతా చూడు. డాక్టర్లు - న్యాయవాదులు - న్యాయమూర్తులు దేశభక్తులుగా ప్రసిద్ధికెక్కారు. ఈ వంశ రక్తాన్ని పంచుక పుట్టిన నీవు - ఒక ఆడది దూర మయిందని చరిత్రహీనుడవౌతావా? నీ జీవితం చరిత్రహీనం కారాదు - ప్రజాసేవలో చరితార్థం కావాలి మధూ! (ఉమాకాంత్ తనధోరణిలో చెప్పుకొనిపోతూ వుంటాడు. మధుదృష్టి పడక మీదున్న రమ ఫొటోమీదకు పోతుంది. రమ ఫొటోను చేతిలోకి తీసుకొనిచూస్తూ, ఉమాకాంత్ మాటలు వింటూవుంటాడు. మధుహృదయంలో

ధ్వంసమైపోయినట్లు చెలరేగుతుంది. మానసిక వేద నతో కృంగిపోయి - బాధను భరించలేక ఫోటోను డ్రాయర్లో పెట్టి బయటికి వెళ్ళిపోతూవుంటాడు.) నీ పరిశోధనలతో భారతజాతిప్రతిభను దేశ - విదే శాల్లో మార్మ్రోగించాలి మధూ! (తిరిగిచూస్తే మధు ప్రక్కనవుండడు. ఇటువేపుచూస్తే బయట కెళ్ళిపోతుంటాడు.) ఆ - మధూ! ఏమిట్రా యిలా మారిపోయావ్ ?

(మధు కెదురుగా కుమార్, విద్యాసాగర్ లు వస్తారు.)

మధు : ఓ! నీవా కుమార్! (చేయి అందిస్తాడు)

కుమార్ : (చేతిలో చేయికలుపుతూ) నేనేలే! ఏవి టలా వున్నావ్ ? తలకు ఆ గాయమేమిటి ?

మధు : (గాయాన్ని తడిమిచూసుకొంటూ, కంపితస్వరంతో) ఇదేనా ?...మానినా మాయనిగాయం కుమార్ !

కుమార్ : నిజమే! గాయంమానినా మచ్చమాత్రం మాయదు. (మాట్లాడుకొంటూ ఉమాకాంత్ ని సమీపిస్తారు.)

మధు : (ఒకరికొకర్ని పరిచయంచేస్తూ) అన్నయ్యా! నా బెస్ట్ఫ్రెండ్ Mr. కుమార్ ఎం. ఏ. మన రమభర్త యితడే. మేమంతా యింటర్ లో క్లాస్ మేట్స్.

విద్యా : అంతేకాదు బావా! ఏకరూములోవుంటూ ఒక కంచంలోతిని, మూడుమంచాల్లో పడుకొనేవాళ్ళం. (ముగ్గురూ నవ్వుతారు.)

మధు: (కుమార్‌తో ఉమాకాంత్‌ని పరిచయంచేస్తూ). మా అన్నయ్య. జస్టిస్. ఉమాకాంత్.

కుమార్ : (చిరునవ్వుతో కరస్పర్శచేస్తూ) Glad to meet you.

ఉమా : Thank you. మా మధు మీ గురించి చాలా చెప్పాడు.

కుమార్ : మీ రెవరూ కనీసం పెళ్ళికైనా రాలేదు.

ఉమా : అంతా వూళ్ళోలేం. మధు మద్రాసునుండి, నేనూ, విద్యా యిప్పుడే హైద్రాబాదునుండి వచ్చాం.

మధు : మా కెవరికీ అసలు మీ పెండ్లిసంగతే తెలీదు.

విద్యా : తెలిస్తే ఎలా రాకుండా వుండగలం.

(మధు table దగ్గరకెళ్ళి పుస్తకం తీసుకొని ఏదో వ్రాస్తుంటాడు.)

ఉమా : Don't mind కుమార్ !

కుమార్ : Never mind! (ఉమాకాంత్‌తో) ఏమిటండీ! ఎలాంటిమధు ఇలా అయ్యాడు? మధు ఒక పజిల్. ఎప్పుడూ అర్థంకాడు.

మధు : (కుమార్‌ని సమీపించి) కుమార్! తెలుగు సాహిత్యంలో శ్రీమదాంధ్ర మహాభాగవతంకంటే పునీతమైనప్రద్గ్రంథమేదీలేదు. నీకు నా పెళ్ళికానుకిదే!

కుమార్ : (పుచ్చుకొని) Thanks! (పై అట్ట తెరచి లోపలి పేజి చూస్తూ) 'మిత్రవాత్సల్యాంజలితో' మధు. చూడు మధూ! (ఏదో చెప్పబోతాడు. ఇంతలో సుబ్బయ్య వచ్చి)

సుబ్బ : భోజనానికి వేళయింది బాబూ !

ఉమా : వస్తున్నాం పద సుబ్బయ్యా ! (సుబ్బయ్య వెళ్ళిపోతాడు.) రండి కుమార్ ! ఈవేళ మీ భోజనం యిక్కడే !

కుమార్ : ఇప్పుడెందుకండీ !

ఉమా : పర్వాలేదు. శాకాహారమే లెండి ! రండి.

విద్యా : అహ అదేం కుదర్దు. రావాల్సిందే !

కుమార్ : (ఏదో చెప్పబోతాడు.)

మధు : (కుమార్ భుజంమీద చేయివేసి) పదనోయ్ – నీవు అడ్డు చెప్పం దెప్పుడు.

(అంతా పోతూవుండగా తెర.)

# అనుబంధాలు

## మూడవ రంగం

[లెక్చరర్ కుమార్ యింట్లో మధ్యహాలు. హాలు చాల విశాలంగా వుంటుంది. లోనికెళ్ళడానికి తలుపులుంటాయి. ద్వారానికి కుడివైపుగల రాక్‌లో పెద్దపెద్ద పుస్తకాలుంటాయి. ద్వారానికి ఎడమవైపున గాడ్రేజ్ బీరువా, బీరువాకు నిలువుటద్దం వుంటుంది. రాక్‌కు పైన రవీంద్రుని ఫొటో తగిలించబడివుంటుంది. గుమ్మానికిపైన గోడకు లేటెస్ట్‌మోడల్ వాల్‌క్లాక్ అమర్చివుంటుంది. ఇంకా గోడకు సుందరదృశ్యాలుగల పటాలుంటాయి. కుడివైపున ఒకప్రక్కన డాబామీదకు వెళ్ళేందుకు పడిమెట్లుంటాయి. ఎడమవైపున ఒకప్రక్కగా క్రొత్తసైకిలుంటుంది.

హాలు మధ్యలో టీపాయి, దాని కటు యిటు కుర్చీలుంటాయ్.

తెర లేవగానే రంగస్థలంలో ఎవరూ వుండరు. కొద్దివిరామంలో కుమార్ మేడమీదనుండి దిగివచ్చి, నిలువుటద్దంముందు నిల్చొని క్రాపు సరిచేసికొంటూ వుంటాడు. లోపలినుండి రమ పాలగ్లాసుతోవచ్చి టీపాయిమీదపెట్టి. సైకిల్ కేరియర్‌కున్న పుస్తకాలదొంతర్ని తీసి రేక్‌లో పెట్తూ - ]

రమ : ఏమండీ! అయిందా?

కుమార్ : జస్టేమినిట్! ... yes ready! (రమవస్తుంది) నీ టాయిలెట్టయిందా? (నవ్వుతూ రమవైపు కన్నార్పకుండా చూస్తాడు)

రమ : (సిగ్గుతో చూపులు ప్రక్కకుమరల్చి) త్వరగా తెమలండి. సినీమాకు వేళయింది. (అంటూ అటు వెళ్ళబోతుంది. కుమార్ రమ రెండుబుజాలు పట్టుకొని దగ్గరకు తీసుకొంటాడు) అబ్బ! వదలండీ, ఎవరైనా చూస్తే ...

కుమార్ : చూడనీ! ఆలుమగలు సరసమాడుకొంటే తప్పా ?

రమ : (చేయిని కుమార్ ఎదమీద వేసి) మీది మరీ ఓవర్!

కుమార్ : (ఇంకా దగ్గరకు తీసుకొంటూ) నేను అదృష్టవంతుణ్ణి రమా! నీవు నా యిల్లాలు కావడం నా భాగ్యం! (రమ తలను కుమార్ హృదయంమీద వుంచుతుంది) నా జీవితానికి జ్యోతివి నీవు. నీవెవరు?- నే నెవరు? నాపైన నీ కెందు కంత అభిమానం ?

రమ : మనం భార్యాభర్తలం కనుక !

కుమార్ : ఏ జన్మ దీ అనుబంధం ?

రమ : (నవ్వుతూ) ఈ జన్మదే!

కుమార్ : (అమాయకంగా) మరి ముందుజన్మలో మనం ఏమయ్యుంటాం ?

రమ : (గంభీరంగా) బద్ధశత్రువులం!

కుమార్ : ఆ!

రమ : కనుకే, మనల్ని యీ జన్మలో భార్యాభర్తలుగా కలిపాడు.

కుమార్ : (రమగడ్డం పట్టుకొని ఆనందంతో కనుపుతూ) ఎక్కడ నేర్చావ్ ఈ మాటలు ?

రమ : మీరు నేర్పిన విద్యయే ...

కుమార్ : నీరజాక్షీ (నవ్వుతూ అంటాడు)

రమ : డిగ్రీక్లాస్సులో మీరు నాకు గురువులుగా !

కుమార్ : అప్పుడేగా - నిన్ను నేను ప్రేమించింది. అయితే, అప్పుడు ఒన్ సైడ్ లవ్ లే !

రమ : (పకపకలాడుతూ) మరి, యిప్పుడో ?

కుమార్ : (నవ్వుతూ) డబుల్ సైడ్ లవ్ ! ... నిన్ను చేసుకొనేవరకూ జీవితం యింత మధురమని తెలీదు రమా !

రమ : ఊ !

కుమార్ : ఆ-(ఇద్దరూ నవ్వుకొంటారు.)

రమ : (టీపాయిదగ్గరకు పోతూ) పరాచికాలు తర్వాత. పాలు చల్లారిపోతున్నాయ్ !

కుమార్ : (ఒత్తిపలుకుతూ) ఓ-యస్ ! (టీపాయిముందున్న కుర్చీలో కూర్చొని రమఅందిస్తున్న పాలందుకొంటూ) నీవు నా కేషమాతావ్ రమా ?

రమ : (కుమార్ క్రాపులోనికి వ్రేళ్ళు పోనిచ్చి) ఊ-తెలీదేంటి ? (నవ్వుతూ) భార్యను.

కుమార్ : ఇంకా పెద్దగా చెప్పాలంటే ?

రమ : ఇల్లాలిని.

కుమార్ : ఊహు ! ఇంకా పెద్దగా—

రమ : నాకు తెలీదు బాబూ !

కుమార్ : చెప్పు రమా ! చెప్పవూ !

రమ : అదేనండీ - చానదంటేను. ఆ-అదే అర్ధాంగిని.

కుమార్ : Yes correct! అయితే, అర్ధాంగి అర్థం పంచుకోవాల్సిందే! (పాలను ఒన్ బై టూ చేసి) ఊ - పుచ్చుకో దేవీ!

రమ : ఊహూ! ముందు మీరే!

కుమార్ : No no! Ladies first!

రమ : మనం భారతీయులం! మీ తర్వాతే నేను.

కుమార్ : Yes - ofcourse! ఇద్దరమూ కలిసే తీసుకొందాం! పాలు సిప్ చేసి గ్లాసు టీపాయిమీద పెట్టి అక్కడున్న కవరుతీసి చూస్తూ) ఎవరు వ్రాసిం దిది?

రమ : ఏమో! చించి చదవండి - తెలుస్తుంది.

కుమార్ : (చదివి) చచ్చాం పో!

రమ : ఏమిటండీ!

కుమార్ : ఇక రెండుగంటల్లో మీ నాన్నగారు దిగుతున్నారు.

రమ : (సంతోషంతో) ఎందుకూ?

కుమార్ : మనల్ని వేరుచెయ్యడానికి.

రమ : అవేం మాటలండీ!

కుమార్ : కాకపోతే మరేమిటండీ!

రమ : నన్నెన్నుంటో చంపక త్వరగా చెప్పండీ!

కుమార్ : మీ నాన్నగారు వస్తున్నారు.

రమ : అదే, ఎందుకు వస్తున్నట్టు?

కుమార్ : ఆయనకేంపనిలేక నిన్ను తీసుకెళ్ళడానికి...

రమ : (కుమార్ పరిస్థితి చూసి నవ్వుతుంది.)

కుమార్ : అవునులే-నీకు నవ్వుగానే వుంటుంది...అబ్బా! నొప్పి! (గుండె పట్టుకొంటాడు.)

రమ : (కంగారుగా) ఎక్కడండీ!

కుమార్ : అబ్బా! బాధ! (తల పట్టుకొంటాడు.)

రమ : ఇదేం బాధండీ!...సరిగా ఎక్కడో చెప్పండి!

కుమార్ : (గుండె పట్టుకొని) ఇక్కడ.

రమ : ఏమండీ, బాగా బాధగా వుందా?

కుమార్ : ఉండదూ మరి. నీవు మీ నాన్నతో వెళ్ళిపోతే - యిక్కడ బాధగానే వుంటుంది మరి.

రమ : (చిరుకోపంతో) పోండీ - మీరు మరీను!...అదర గొట్టేశారు.

కుమార్ : దీనికే అదిరిపోతే - మరి భవిష్యత్తుమాటేమిటి?

రమ : అది దేవుడెరుగు.

కుమార్ : రమా! (సీరియస్‌గా) ఇన్నాళ్లూ యీ విషయం నాతో ఎందుకు చెప్పలేదు? ఈ దాపరికాలు ఎక్కడ నేర్చావ్?

రమ : దాపరికాలా! ఏమున్నాయ్?

కుమార్ : అయితే, ఏడు వ్రాసింది అబద్ధమన్నమాట? (రమ పూర్తిగా భయపడి వణకుతుంది. కుమార్ రమ చెవి మెలిపెడుతూ) నీకు నెలలటగా! ఎన్ని? (రమ కుమటపకేలోపల) ఊ-చెప్పు! (రమ నాలు గని వ్రేళ్లు చూపిస్తుంది.) ఇన్నాళ్లూ చెప్పావు కాదేం? (రమ చెవిలో మెల్లగా) నీ కడుపెత్తుగా వుంటే - బలుపనుకొన్నా.

రమ : ఛీ : (సిగ్గుతో కుంచించుకుపోతుంది.)

కుమార్ : ఈ నేరానికి శిక్షేమిటో తెలుసా? నీవు నాకు ఒక చిన్నారి - పొన్నారి - అల్లరి అబ్బాయినే యివ్వాలి.

రమ : అంతా మీ యిష్టమే నేమిటి ?

కుమార్ : మరెవరిష్టమేమిటి! నీవు అబ్బాయినే కనాల. నామాట విను రమా! ఏం? కంటావా ?

రమ : మీకు పిచ్చా ఏమిటి?

కుమార్ : నీవు అబ్బాయిని కంటే -నాకు వానితో చాలా పనుందిలే !

రమ : ఏంపని? వాడినీ మీలాగే...

కుమార్ : (గంభీరంగా) అదికాదు రమా!...నీవు మరో విధంగా అనుకోకపోతే-మనఅబ్బాయికి నా స్నేహితునిపేరు పెట్టుకొంటాం.

రమ : ఎవరండీ వారు ?

కుమార్ : మన మధు!

రమ : (తనలో) ఆ! మధు!

కుమార్ : (తనధోరణిలో) మధు నా ప్రాణం! నేనతని జీవం! మా స్నేహం అపూర్వం! (నిట్టూర్చి) ఒక స్త్రీమూలంగా మధుజీవితం చితికిపోయింది. మధు ఎవర్నో ప్రేమించాడు. అతనిప్రేమ అనూహ్యం! ఎవరూ ఎవర్నీ అంతయిదిగా ప్రేమించి వుండరట రమా! కానీ, ఏంలాభం? మధూకు మిగిలింది నిరాశ! బాధ!...ఆ స్త్రీ మధూనుకాదని వేరొకర్ని

భర్తగా స్వీకరించి వెళ్ళిపోయిందట. (రమ అలలు అలలుగా పొంగిపొరలివచ్చే ఆవేగాన్ని ఆపుకో ప్రయత్నిస్తూవుంటుంది.) అంతా, మధూకు మతి చలించే దేశదిమ్మరయ్యాడంటావు? (రమ బాధతో తూలుతుంది.) అసలే వాడు నాలా మానసికంగా బలహీనుడు. వాడు బ్రతికుంటాడనే నమ్మకం... (రమ తూలి పడిపోతుంది. కుమార్ వెనుతిరిగిచూసి ఆదుర్దాగా) ఆ-రమా! ఏమిటిది? ఏం జరిగింది? (లేవనెత్తి) అదేం అలా అయ్యావ్?

రమ : (ఏడుపు దిగమ్రింగి) ఏంలేదు! కళ్ళుతిరిగి తూలి పడ్డాను.

కుమార్ : దెబ్బతగిలిందా?

రమ : అబ్బే లేదండీ!

కుమార్ : అయితే ఏడుస్తున్నావేం? గాయం గట్టిగానే తగిలివుంటుంది.

రమ : (నిట్టూర్చి) అవును. గట్టిగానే తగిలింది ఒకప్పుడు. మాసిన గాయం... (ఏడుపువలన మాట పెగలదు.)

కుమార్ : మళ్ళీ బాధపెట్టూవుందా? ఎక్కడ? ఉండు - డాక్టర్ని పిలవనా?

రమ : (భర్తచేయిపట్టుకొని వారిస్తూ) అవసరంలేదు.

కుమార్ : (రెండుచేతుల్లోకి రమముఖాన్ని తీసుకొని) ఏదీ- ఒకసారి నవ్వు!... (ప్రాధేయపూర్వకంగా) నవ్వవూ! (గోముగా) మా రమ మంచిపిల్ల! (రమ నవ్వు తుంది. కుమార్ జతకలిపి) అలా వుండాలి. (విద్యా

సాగర్ ప్రవేశించి యీ సన్నివేశం చూసి సిగ్గుపడి వెనుతిరిగి వెళ్ళబోతాడు. విద్యాసాగర్‌నిచూసి రమ దూరంగా సర్దుకొని—)

రమ : రారా అన్నాయ్ !

కుమార్ : (వెనుతిరిగిచూసి నవ్వుతూ) ఛఛ -యీ బ్రహ్మచారులున్నారే - వీళ్ళకు సమయం సందర్భం అసలే తెలీదు రమా !

విద్యా : (సిగ్గుతో బిక్కచచ్చిపోయి, తేరుకొని) చాల్లే వోయ్ ! వసపోసినపిట్టలా నీ వాగుడూ నీవూను.

కుమార్ : అన్నావ్, నీవూ అన్నావ్—వసపోసిన పిట్టని ! ఇక యిక్కడుంటే మన పరువుండదు. వస్తా. (వెళ్ళబోతాడు.)

విద్యా : ఓయ్...ఓయ్...బావా ! ఉండు – నీతోపనుంది!

కుమార్ : ఎందుకూ ? మీ రిద్దరూకలసి నా చెవులకు తాటాకులు కట్టేందుకా ?

విద్యా : అందుకే మరి !

రమ : (నవ్వుతూ) ఏమిటండీ ! మీరూ మీ పంపరానూ !

కుమార్ : మరిచేపోయా ? అర్జంటుగా ప్రిన్సిపాల్‌ని కల్సుకోవాలి. రమా ! (విద్యాసాగర్‌తో) ప్రక్కల్లే తేరా ! నే నొచ్చేవరకూ మీ చెల్లాయితో పోట్లాడుతూవుండు. (రమ,విద్యాసాగర్ నవ్వుతారు. కుమార్ పొరపాటు తెల్సుకొని తనూ నవ్వుతూ) I mean, మాట్లాడుతూవుండు. వస్తా. (కుమార్ బయటికి

వెళ్ళిపోతాడు. రమ లోనికెళ్ళి టిఫిన్, కాఫీ తెచ్చి విద్యాసాగర్ ముందు పెట్టూ—)

రమ : టిఫిన్ తీసుకోరా !

విద్యా : ఇప్పుడొద్దమ్మా! తీసుకొనే వచ్చాను.

రమ : నాకోసం తినరా!...ఊఁ- తినమంటే!

విద్యా - మా అమ్మవికదూ! వద్దంటే—

రమ : (విద్యాసాగర్ గడ్డం పట్టుకొని) మా నాన్నవికదూ! తినమంటే-తినాలి! (విద్యాసాగర్ తింటూతింటూ తలెత్తి రమముఖంలోకి చూసి –)

విద్యా : అదేం రమా, అలావున్నావ్ ?

రమ : ఏంలేదు. మనవ్వూరునుండేనా రావడం ?

విద్యా : లేదమ్మా! ఒక వూరంటూలేదు. ఆరు నెలలనుండి తిరుగుతూనేవున్నాం. మధు ఎక్కడా కన్పించలేదు.

రమ : మధూరు మతిచలించే వెళ్ళిపోయాడంటావా ?

విద్యా: ఎందుకులే రమా తిరగకోడటం.

(కుమార్ చేతిగుడ్డతో ముఖంతుడుచుకొంటూ ప్రవేశిస్తాడు. చేతిగుడ్డ జారి క్రింద పడిపోతుంది. క్రిందపడిన చేతిగుడ్డను ఎత్తుకొంటూ – రమ విచారంగా మాట్లాడ్డం విని అక్కడే ఆగిపోతాడు. రమ విద్యాసాగర్‌లు కుమార్‌ని చూడరు.)

రమ : మధు పున్నతిని – భవిష్యత్తును – బతుకును బద్దలు చేసింది నేను. నన్ను ప్రేమించి మధు ఏం బాగు పడ్డాడు ?

విద్యా : రమా! ఏమి టీ బలహీనం? ఊరుకో –ఎవరన్నా

వింటే...(మాట్లాడలేడు.) (కుమార్ ముఖంలో బాధ ఆశ్చర్యం వ్యక్తమౌతుంటాయి. విద్యాసాగర్ తనలో తనే కుమిలిపోతూ——) జరిగింది కలగా మర్చిపో రమా! గతాన్ని త్రవ్వకోకు. (ఇటు తిరుగుతాడు. అప్పుడే కుమార్ ముందుకువస్తాడు.) నీవా కుమార్! ఎంతసేపయింది వచ్చి? ప్రిన్సిపాల్ లేడా? ... పలకవేం? (రమ చాటుగా కళ్ళొత్తు కుంటుంది.

కుమార్ : లేడు!

విద్యా : (అనుమానంగా) అదేం అలా వున్నావ్?

కుమార్ : (తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో) ఎలా వున్నాను?

విద్యా : అదోలావుంటే——

కుమార్ : అంటే?——నీకు అలా కన్పిస్తున్నానా? (వాచి చూసుకొని) ఆ-పిక్చర్ కెళ్ళాం రా రమ్!

విద్యా : I am sorry కుమార్! నే నీ రాత్రిబండికే వెళ్ళాలి.

కుమార్ : ఇంటికేనా?

విద్యా : అవును.

రమ : ఇప్పుడే వచ్చి అప్పుడే పోతానంట్రా?

విద్యా : మీ రిక్కడికి మారాక నేను రాలేదుగా! మిమ్మల్ని చూడాలని మనసైంది, వచ్చాను - చూశాను. వస్తానమ్మా! వెళ్ళొస్తా కుమార్!

కుమార్ : సరే, నీ యిష్టం! (విద్యాసాగర్ వెళ్ళిపోతాడు.) పద రమా మనం పోదాం!

రమ : ఉండండి వస్తాను! (టీపాయిమీదున్న టీ తీసుకొని లోపలికెళ్ళిపోతుంది. వెళ్లే రమవైపు పరీక్షగాచూసి, బాధగా కుర్చీలో కూర్చుంటాడు.)

తెరలో రమ : మధూ పుష్పాన్ని - భవిష్యత్తును - బ్రతుకును బ్రద్దలుచేసింది నేను. నన్ను ప్రేమించి మధు ఏం బాగుపడ్డాడు...

తెరలో విద్యా : రమా! ఏమిటీ బలహీనం? ఊరుకో - ఎవరన్నా వింటే...జరిగింది కలగా మర్చిపో రమా! గతాన్ని త్రవ్వుకోకు!

కుమార్: (కుమార్ని మాటలు కలతపెట్టాయి. విపరీతంగా ఆయాసపడ్తాడు. ముఖమంతా చెమటపట్టుంది. లేచి_) రమా! (రమ చేత్తో వ్యానిటీబ్యాగు పూపుకొంటూ ప్రవేశిస్తుంది. కుమార్ రమదగ్గరకెళ్ళి రమముఖంలోకి చూస్తూ ఏమో చెప్పబోయి ఆగి_) ఏం లేదు. పద; (ఇంతలో బయటినుంచి బోయ్_)

బోయ్ : సార్ !

కుమార్ : (పోబోయి ఆగి) Yes కమిన్ బోయ్! (బోయ్ ప్రవేశించి విజిటింగ్ కార్డు చేతికిస్తాడు. కుమార్ దానిని పైకి చదువుతూ) M. C. శేఖర్, బి. ఏ.___ Who !

రమ : (తనలో) ఆ!

కుమార్ : (బోయ్తో) పంపించు! (బోయ్ వెళ్ళిపోతాడు. మన పిక్చర్ ప్రోగ్రాం క్యాన్సిల్ రమా! వెళ్ళి రెండు డ్రింక్స్... (రమ వెళ్ళిపోతూ ఆగుతుంది.

శేఖర్ ప్రవేశించి వెళ్లే రమను చూస్తూ అక్కడే ఆగిపోతాడు. రమ వెళ్ళిపోతుంది.) అక్కడేనిల్చున్నా రేం? రండి!

శేఖర్ : నమస్కారమండీ!

కుమార్ : నమస్తే! కూర్చోండి! మీరు...

శేఖర్ : మీ శ్రీమతి మేనమామను.

కుమార్ : ఓ! ఆ శేఖర్ మీరేనా? మిమ్మల్ని యిదే చూడటం. అదేం, మీరు పెండ్లికూడా రాలేదే!

శేఖర్ : అప్పట్లో నాకు సెలవు దొరకలేదు.

కుమార్ : మీ రిప్పుడైనా వచ్చారు. చాలా సంతోషం! (కుమార్ లేస్తాడు.)

శేఖర్ : ఎక్కడికో ప్రయాణమైనట్టున్నారే! మధూ దగ్గర కేనా?

కుమార్ : (బాధపడి నేసుకుంటూ) వా డిక్క డెక్క డున్నాడు?

శేఖర్ : అరే, మీకు తెలీదా?

కుమార్ : అవును. నేను యీమధ్యనే యిక్కడికి ట్రాన్స పరయ్యాను.

శేఖర్ : మధు యిక్కడి గవర్నమెంటుహాస్పిటల్లో సర్జన్ గా వున్నాడు.

కుమార్ : అలాగా! నాకు తెలీదే!

శేఖర్ : మీ రమకు తెలిసుండాలే! మీకు చెప్పలేదా! ఆ-ఆ కెందుకు చెప్తుందిలెండి!

కుమార్ : అంటే ? ... చెప్పండి ! ... మీ కేదో దాస్తు న్నారు. నిజం చెప్పండి శేఖర్ !

శేఖర్ : ఎందుకులెండి చెప్పడం ? అదో పెద్దగాథ !

కుమార్ : నేనూ విన్నాను. అది నిజమో కాదో...

(బయట కారుహారన్ విన్పిస్తుంది.)

శేఖర్ : మీరు విన్నది నిజం...బాధపడకండి ! (మళ్లీ బయట హారన్ విన్పిస్తుంది.) సారీ ! బయట నా స్నేహితుడున్నాడు. నేనొచ్చివెళ్లానని రమతో చెప్పండి. మళ్లీ రేపు కలుస్తా ! (మెరుపులా వెళ్ళి పోతాడు. కుమార్ ఏదో చెప్పబోతాడు. మాట పెగలదు. అంతలో రమ డ్రింక్స్ తెచ్చి టీపాయి మీద పెట్టుంది.)

కుమార్ : రమా ! (రమకళ్ళల్లోకి చూస్తాడు. రమ చూపుల్లో చూపులు కలపలేక ప్రక్కకు మరల్చు తుంది. కుమార్ నిట్టూర్చి) మీ బావొచ్చాడు. చూశావా ?

రమ : చూశాను.

కుమార్ : పల్కరించలేదేం ?...ఇప్పుడే వెళ్ళాడు, పిలవనా?

రమ : అవసరంలేదు.

కుమార్ : మీ బావను చూసినప్పుడు, చెప్పిందీ వినేవుంటా వనుకొంటా ! (రమనుండి సమాధానం రాదు.) మధుతో నీ సంబంధం...(రమ మౌనం) చెప్పు? ...తలొంచుకొన్నావేం ? తలెత్తి నిజం చెప్పు, ప్రేమించావా ?

రమ : (ఆ చూపులకు రమ చలించిపోయి) ప్రే ... మిం...చా!

కుమార్ : ఛీ! (లెంపకాయ వేసి) సిగ్గులేదూ? (పిడికిలి బిగించి బాధపడ్డాడు.)

రమ : మనసివ్వడంతప్ప నేను చేసిన నేరమేమిటి?

కుమార్ : ప్రేమ మధుతో, పెళ్ళి నాతో-యిది ద్రోహం కాదా?

రమ : ప్రేమకు అర్థం?

కుమార్ : మనసులు కలుపుకోవడం!

రమ : మీరు స్త్రీలో దేనికి ప్రాధాన్యమిస్తారు?-మనస్సుకా? శీలానికా?

కుమార్ : (ఎదురుచూడని యీ ప్రశ్నకు సంబద్ధమైన ఏం జవాబివ్వాలో తోచక) రెంటికీ!

రమ : అయితే, మీరు పెండ్లాడకుండా వుండాల్సింది.

కుమార్ : ఏం?

రమ : ఈ దౌర్భాగ్యపుదేశంలో స్త్రీ మనసివ్వడం-చెడటం మహా నేరం!_ఈ రెంటికీ కట్టుబడిన స్త్రీని ఒక్కరిని చూపించండి?

కుమార్ : (అయోమయుడౌతాడు.)

రమ : చూపించలేరు. ఇది చూడండి! పెళ్ళికానికన్య అందమైన యువకునిచూసి "ఇలాంటివాడు నా భర్త యితే...."

కుమార్ : అని అనుకోవడంలో తప్పేముంది? అది సహజమేగా!

రమ : మనసుచలించిన ఆ కన్య మానసికంగా పతితేనా ?

కుమార్ : కాదు. ఇక్కడ ఆ కన్యమనస్సు చలిస్తుంది. అంతే !

రమ : మనసివ్వడానికీ – చలించడానికీ తేడా నేమిటి ?

కుమార్ : రెండూ ఒకటే !

రమ : మనసివ్వడంతప్ప నాలోవున్న దోషమేమిటి ?

కుమార్ : (కోపోద్రిక్తుడై) అవన్నీ కట్టిపెట్టు. నీ జీవితం కళంకితం ! నీవు కళంకినివి ! ఇక నా కళ్లు కప్పలేవు.

రమ : ఏమండీ !

కుమార్ : నీకీ యింట్లో స్థానంలేదు. మనసు నాదికాని నీ శరీరం నా కెందుకు ? నీవు పరాధీనవు. నా భార్యవు కావు.

రమ : ఆ ! (చేయి నోటికడ్డంపెట్టుకొని ఏడుస్తూ) నేను మీ భార్యను కానా ? అంతమాటనకండి ! మీరు నన్ను అగ్నిసాక్షిగా పెండ్లాడలేదా ?

కుమార్ : నీవు నన్ను మనస్సాక్షిగా పెండ్లాడావా ?... మాట్లాడవేం ? నీ మనస్సు పరాధీనం. నిన్ను చూస్తూ బాధపడుతూ యిక నీతో కాపురంచెయ్యలేను. నీకు విడాకులివ్వాలనుకొంటున్నా !

రమ : నన్ను చంపండి ! నరకండి ! చిత్రవధ చెయ్యండి ! కానీ, విడాకులివ్వకండి !

కుమార్ : అయితే మంచిగా మనిషిగా చెప్తున్నా ! నీ పుట్టింటికెళ్ళిపో !

రమ : ఒకరింటికి నే నెందుకు పోవాలి ? ఇది నా యిల్లు.

కుమార్ : రమా! నన్ను (ఆయాసపడుతూ) పశువును చేస్తున్నావ్ !

రమ : ఇది నా సంసారం !

కుమార్ : నన్ను రెచ్చగొట్టక వెళ్ళిపో !

రమ : నే నెందుకుపోవాలో చెప్పండి?

కుమార్ : ఛీ ఛో! (మెడపట్టుకొని గెంటుతాడు. అప్పుడే ప్రవేశించిన రాఘవయ్యమీద వాలిపోతుంది. కుమార్ రాఘవయ్యనుచూసి) వచ్చారా? మీ కూతుర్ని మీ యింటికి తీసుకెళ్ళండి !

రాఘు : ఏం పాపం చేసిందని ?

కుమార్ : ఘూని మనసార అనుకొని, నన్ను కట్టుకొని నాకు...

రాఘు : కుమార్ !...ఇదంతా ఎవరు చెప్పారు?

కుమార్ : మీ కూతురినోటినెంటే విన్నాను.

రాఘు : నిజానిజాలు తెల్సుకున్నావా? ... నాయనా కుమార్ ! రమ నీ భార్య. నీవామె భర్తవు. ఇది ఎడతెగని అనుబంధం.

కుమార్ : ఆ 'అనుబంధాలు' తెగిపోయాయి.

రాఘు : నీవు తెంచుకొన్నా నిన్ను వీడిపో దీ బంధం! (రమతో) రమా ! ఇటుచూడమ్మా ! నీ చరిత్ర పవిత్రమైతే - నీవు మానవతివైతే నీ విక్కడేవుండాలి. పతిసాన్నిధ్యమే హిందూస్త్రీకి ఆధారం ! నిజం నిలకడమీదే తెలుస్తుందమ్మా !

రమ : నాన్నా ! మీరూ...

రాఘు : చెడి పుట్టింటికి రాకూడదమ్మా! నీవిలా వస్తే - లోకులు కాకులై పొడుస్తారు.

రమ : లోకానికైనా నిజం తెలియదా నాన్నా ?

రాఘు : లోకం! హు! లోకం గుడ్డిది. కానీ మూగది కాదమ్మా! (రమవైపుచూసి) నన్ను అపార్థంచేసుకోకమ్మా! వస్తా! (విచారంగా బయటకు వెళ్ళిపోవడంతో - తండ్రి నిర్దయహృదయానికి సబురాలై పిలవను నోరు పెగలక అలాగే నిలబడిపోయి వెను తిరిగి కుమార్ వైపు చూస్తుంది. కుమార్ రమ ముఖాన్ని చూడ సిచ్ఛగించక)

కుమార్ : ఆగావేం! వెళ్ళిపో!...ఊ-వెళ్ళు!

రమ : (ముందుకువస్తూ) నేను పోను. పోలేను. నన్ను పొమ్మనకండి. వెళ్ళి నేనెంకా నీ లోకంలో ?

కుమార్ : ఏ నుయ్యో గొయ్యో చూసుకో!

రమ : (ఇంకా ముందుకువస్తూ) నా చావే మీ కిష్టమైతే - నే నిక బ్రతికుండను. (కుమార్ పాదాలకు నమస్కరించ బోతుంది. కుమార్ పాదాలను వెనక్కులాక్కుంటాడు. రమ విచారంగా తల పైకెత్తి భర్త ముఖంలోకి చూస్తుంది. కుమార్ విచారంగా డాబా మీదకు పోతాడు. కుమార్ పాదాలున్న చోట తన రెండుచేతులూ వుంచి కళ్ళకద్దుకొని యిల్లువదలి వెళ్ళిపోతూవుండగా—సంధ్య తెరపడుతుంది.

సమయం : రాత్రి పదిగంటలు : వీధి :

జనసంచారంలేని వీధి. ఒక వ్యక్తిమాత్రం సైకిలుతో

యీల వేసుకొంటూ యిటువైపునుండి అటు వెళ్తాడు. దూరంగా కార్లు, రిక్షాలు, ఆటోరిక్షాలు వెళ్లే చప్పుడు, హారన్లు లీలగా వినిపిస్తుంటాయి. ఒకవైపునుండి రమాదేవి ప్రవేశిస్తుంది. జుత్తు రేగి, చెక్కిళ్ళపై కన్నీటిచారలు కట్టి వుంటాయ్. ఇంకొకవైపునుండి యిద్దరువ్యక్తులు ప్రవేశిస్తారు. ఇద్దరూ డాక్టర్లే. అందులో ఒకరికి బాగా గడ్డం పెరిగి కళ్లు లోతుకు పీక్కుపోయి పేలగాఉంటాడు. ఇతను మధు. మరొకతను బాగా బలంగావుంటాడు. ఇద్దరి చేతుల్లోను స్టెతస్కోపులూ – మెడిసన్ బాక్సులూ వుంటాయ్. ఇద్దరూ మాట్లాడుకొంటూ వస్తారు. రమ మధూను గమనిస్తుంది. కొంగు తలమీదకు లాక్కొని ముఖం చాటుచేసుకొంటుంది. రమనుదాటి యిద్దరూ రెండుమూడడుగులు ముందుకుపోతారు. రమ తిరిగితిరిగి చూస్తూపోవడంలో అరటి తొక్కమీద కాలువేసి జారి క్రిందపడి—

రమ : అమ్మా! (ఇద్దరూ వెనుతిరిగి చూస్తారు.

మధు : (ఆదుర్దాగా రమదగ్గరకొస్తూ) ఏమయిందమ్మా!
(రమ లేవబోయి లేవలేకపోతుంది. మధు సాయం పట్టి లేవనెత్తి రమనుచూసి) ఆ! ర....మా!!

రఘు : ఎవరు మధూ?

రమ : మధూ!

మధు : ఈ వేళప్పుడు యిక్కడి కెందుకొచ్చావ్ రమా?

రఘు : మధూ! అక్కడ సీరియస్‌గావుంది.

మధు : చూడు రఘూ! నీ వెళ్ళి చూడు! నేను తర్వాత వస్తా!

రఘు : సరే, త్వరగా రావాలి మరి. (బూట్లచప్పుడు చేసుకొంటూ వెళ్ళిపోతాడు.)

మధు : మాట్లాడవేం రమా? ... రమా! ... ఏడుస్తున్నావేం?

రమ : ఏం చెప్పను మధూ! (ఇద్దరూ దారికి మధ్యలో వుంటారు. సైకిలుపై ఒకవ్యక్తి బెల్లిస్తూ వస్తాడు. ఇద్దరికీ విన్పించదు. ఆ వచ్చినవ్యక్తి మధూకు జానెడు దూరంలో ఆపి.)

ఉమా : ఏమండీ! బెల్లు విన్పించడంలా?

మధు : (వెనుతిరుగుతూ) క్షమించండి! (ఆయన్ని చూసి) అన్నయ్యా!

ఉమా : మధూ! ... (రమనుచూసి సిగ్గు) యిక్కడున్నావేం రమా?... కుమార్ నువ్వు పుట్టింటికి వెళ్ళావని చెప్పాడే! – ఇప్పుడు నేను మీయింటినుండే వస్తున్నా. (రమ ఏడుస్తుంది) ఏడుస్తావేం? ... చెప్పమ్మా! ఏంజరిగింది?

మధు : ఏమిటి రమా యిది! చెప్పకుంటే నన్ను చంపుక...

రమ : మధూ! ... వారికి నా ముఖం చూపలేను. నన్ను ప్రేమను అపార్థంచేసుకొని ...

ఉమా : ఎలా తెల్సిందీ – ఎవరు చెప్పారు?

రమ : శేఖర్ !

ఉమా, మధు : ఆ !

రమ : నాకు వసమ్మాను నమ్మి నన్ను . . .

ఉమా : గెంటేశారా?

రమ : అవును. నా అని చెప్పుకోనే మానాన్నకూడా...

ఉమా : తిట్టినా కొట్టినా అక్కడే పడుండమన్నాడుకదూ! ఆయన తరహానే అంత! ఒట్టి పాతకాలపుమనిషి. మరేం పర్వాలేదులే - మేమున్నాంగా!

మధు : చూడన్నయ్యా! ఇప్పట్లో రమకు మనం ఆశ్రయమిస్తే - కుమార్ కి అనుమానం ...

ఉమా : ఎక్కువౌతుందంటావా?

రమ : అవును మామయ్యా! మధు చెప్పింది నిజం! నాదారిన నన్ను పోనివ్వండి! (పోబోతుంది)

ఉమా : రమా! (వారిస్తాడు)

రమ : అడ్డు చెప్పకండి!

ఉమా : ఇప్పుడు ఎక్కడికిపోతావ్? నామాట వినమ్మా!

రమా : మీకు తెలీదు మామయ్యా! నేను మీ పంచన చేరితే లోకులు వూరుకోరు.

ఉమా : (నవ్వి) పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డవాళ్ళుకారమ్మా! లోకులు నిందిస్తారేకానీ, నీకు నిలువ నీడనిస్తారా? (రమ వెళ్ళిపోతూ వుంటుంది. మధుతో) ఊర్కొన్నావేం మధూ? నీవైనా చెప్పిచూడు.

మధు : మీకు తెలీదన్నయ్యా!

ఉమా : నీకు మహా తెలిసినట్టు. రమను నీవేకాదంటే-యీ స్థితిలో రమ బ్రతుకుతుందా?

మధు : అన్నయ్యా! (వెళ్ళే రమనుచూసి) రమా! (రమ ఆగుతుంది. రమదగ్గరకుపోయి) నామాట విను రమా!

నీవెళ్ళొద్దు ... వెళ్ళనను రమా! (కన్నీళ్ళుపెట్టు కొంటూ) వెళ్ళనవ్వా!

రమా : ఏమిటి మధూ చంటిబిడ్డలా...

మధు : నేను నీ దృష్టిలో చంటిబిడ్డనా? అయితే యింకేం! నీబిడ్డనుకాదని పోతావా – రా రమా వెళ్దాం! (రమ చేయిపుచ్చుకొని ఉమాకాంత్‌ని సమీపించి) అన్నయ్యా! రమను తీసుకొని మీ రింటికివెళ్ళండి! నేను కుమార్‌తో జరిగింది చెప్పి – రమ సంసారం నిలుపుతాను. ఆ – అన్నట్టు! రమను జాగ్రత్తగా చూడండి!

ఉమా : నీవింతగా చెప్పాలా మధూ? ఇప్పట్లో నీవేమి చెప్పినా కుమార్ నమ్మడు. నాలుగు దినా లాగి కల్సుకో!...నీవిక్కడ సర్జన్‌గా పనిచేస్తున్నావటగా!

మధు : అవును, మీకెలా తెల్సు?

ఉమా : తెలిసే నీకోసం యిలా వచ్చాను. వెంటనే రిజిగ్నేషనిచ్చెయ్.

మధు : ఉద్యోగానికా!

ఉమా : అవును. కుమార్‌ని కల్సుకొని త్వరగాయింటికిరా!

మధు : అలాగే! ... రమా! మీయింటి అడ్రెస్?

రమ : 13 నెహ్రూస్ట్రీట్. (మధు వెళ్ళబోతాడు.) మధూ! (మధు ఆగుతాడు) కోపంలో వాగేసున్నా – వాగి నేమీ అనకు.

మధు : (నిట్టూర్చి) సరే! (వెళ్ళిపోతాడు)

ఉమా : పదమ్మా! (ఇద్దరూ యిటుపోతూవుండగా తెర)

---

# అనుబంధాలు

## నాలుగవ రంగం

[అంతా మూడవరంగంలోవలె వుంటుంది. ఎక్కడపస్తువులు అక్కడనే చిందరవందరగా పడి వుంటాయి. మొత్తంమీద ఆ వాతావరణం నిర్లక్ష్యతని వ్యక్తంచేస్తోంది.

తెరలేచేసరికి కుమార్ విచారంగా కళ్ళుమూసుకొని సోఫాలో పడుకొని వుంటాడు. గడ్డం పల్చగా పెరిగివుంటుంది. ముఖంలో బాధ, విరక్తి స్ఫుటంగా కన్పిస్తుంటాయి. మాసినబట్టలు, రేగినజుత్తుతో వుంటాడు. మాటాడే ప్రతిమాటలోను బాధ, క్రోధం మిశితమైవుంటాయి. సోఫాలోనుండి లేచివెళ్ళి రేక్‌లోంచి పుస్తకంతీసి చూస్తూవుండగా—]

తెరలో రమ : మధు వున్నతిని భవిష్యత్తును బ్రతుకునూ బ్రద్ధలు చేసింది నేను. నన్ను ప్రేమించి మధు ఏంబాగు పడ్డాడు.

తెరలో విద్యా: రమా! ఏమిటీ బలహీనం? ఊరుకో! ఎవరన్నా వింటే ... జరిగింది కలగా మర్చిపో! గతాన్ని త్రవ్వుకోకు.

కుమార్ : (విపరీతంగా బాధపడుతుంటాడు)

తెరలో శేఖర్: మీరు విన్నది నిజం! ... బాధపడకండి! (కారు హారన్ విన్పిస్తుంది.) సారీ, బయట నా స్నేహితు

డున్నాడు. నేనొచ్చి వెళ్ళానని రమతో చెప్పండి! మళ్ళీ రేపు కలుస్తా!

మధు : (మధు ప్రవేశించి వెనకనుండి కుమార్ భుజంమీద చేయివేసి) కుమార్!

కుమార్ : (మధు కన్పించేసరికి నిశ్చేష్టుడయ్యాడు. క్షణం నోట మాటరాలేదు. గుటకలు మింగాడు)...నీవింత నైతిక పతితుడ...

మధు : ఆపు కుమార్! నేను ఏనాడూ నీతిని గోతిలో...

కుమార్ : అవన్నీ ఎందుకు? నీవు రమను ప్రేమించలేదా?

మధు : ప్రేమించాను. ప్రేమించటం తప్పా?

కుమార్ : ప్రేమిస్తే పెళ్ళెందుకు చేసుకోలేదు? (మధు ఏదో చెప్పబోతాడు. ఇంతలో కుమార్-) జవాబు చెప్పవేం? మీ ఆంతర్యాలు నాకు తెల్సు. నేను యింట్లో లేనప్పుడు నీవూ రమా కలిసి ...

మధు : (సీరియస్‌గా) కుమార్! (చేయెత్తి కొట్టబోతాడు. తెరలోపలినుండి రమమాటలు విన్పిస్తాయి)

తెరలో రమ : మధూ! కోపంలో వారేమన్నా వారినేమీ అనకు.

మధు : (ఎత్తినచేయి దించుతూ) ఛీ! నీ అనుమానమే నిన్ను యిలా అల్పుని చేసింది.

కుమార్ : మధూ!

మధు : నామాట నమ్ము కుమార్! రమజీవితం నిష్కళంకితం! ఆమెను స్వీకరించు!

కుమార్ : నీకెందుకింత బాధ? నీకూ దానికీ వున్న అను బంధం ఏమిటి?

మధు : నావలన మీదాంపత్యంలో తుపానులు రేగాయ్. నేను ఎలా చూస్తూ వుండగలను కుమార్ ?

కుమార్ : అయితే, యిప్పటి నీ సలహా నీ సంపర్కంలో నలిగి చెడిన రమను ...

మధు : (బాధ క్రృంగదీస్తుంది) చాలు కుమార్ ! ఇక ఆపు...ఆపెయ్ !...ఇంత నీచాభిప్రాయం నీలో... భగవాన్ ! ... శరీరాలు వుపయోగించుకోకుండా ప్రేమించుకొన్నాం. ఇదేనా మేంచేసిన నేరం?

కుమార్ : నా పెండ్లికిముం దీవిషయం నాతో నీ వెందుకు చెప్పలేదు ?

మధు : నీతో చెప్పడానికి అవకాశం ఎక్కడిది కుమార్ ? నేనొచ్చేవేళకు రమతో నీపెళ్ళి జరిగిపోయిందిగా! అసలు జరిగిం దిది. నేను మద్రాసులో వుండగా రమకు 'నిన్ను చేసుకోవడానికి యిష్టంలేద'ని నేనే వ్రాసినట్లు ఫోర్జరీలెటర్ వ్రాశారు. రమ దానిని నమ్మి - తన తండ్రిమాటను కాదనలేక నిన్ను...

కుమార్ : అది వ్రాసిందెవరు ?

మధు : ఎవరో! అదే యింతవరకూ తేలలేదు. పద కుమార్ ! రమ నీ అనురాగానికీ దూరమయింది. అటు కన్నతండ్రినీ పోగొట్టుకొంది. (కుమార్ ప్రశ్నార్థకంగా చూస్తాడు. మధు జేబులోనుండి టెలి గ్రాం తీసియిస్తూ) - ఇది చూడు !

కుమార్ : (టెలిగ్రాం చదివి) ఆ!

మధు : చూశావా? మీ మామగారు కలరాతో పోయారు... ప్రస్తుతం రమ ఎక్కడుందో తెలుసా?...మా ఇంట్లో వుంది.

కుమార్ : మీ యింట్లోనా!

మధు : అవును ... ఏం కుమార్! నాతో వచ్చి రమను స్వీకరించవూ!

కుమార్ : రమను స్వీకరించినా – మీ ప్రేమను నేను మనసులో వుంచుకొని ... (బాధగా ముఖం ప్రక్కకు త్రిప్పుకొని) మా మనసులు విరిగాయ్. అవి కల్వుకోవు మధూ! ... నీవు నిజం చెప్తున్నావని నాకు నమ్మకమేమిటి? (వెళ్ళిపోతూ వుంటాడు)

మధు : కుమార్!

కుమార్ : (మధు పిలుపులోని మార్దవానికి ఆగి, బాధగా) మధూ! నన్ను వేధించకు. నన్ను అర్థంచేసుకో మధూ! ... నన్ను అర్థంచేసుకోవేం? (కుమార్ చకచక డాబామీదకు వెళ్ళిపోతాడు. మధు మేడ మెట్లవరకు కుమార్‌ను వెంబడిస్తాడు. తర్వాత పైకి పోదామా – వద్దా? అని తటపటాయిస్తూవుండగా తెర.)

---

# అనుబంధాలు

## అయిదవ రంగం

[అంతా రెండవరంగంలోవలె వుంటుంది.

తెరలేవగానే రమ మంచంమీద పడుకొని ఏడుస్తూ వుంటుంది. కొద్దివిరామం తర్వాత సుబ్బయ్య లోపలినుండి ప్రవేశించి రమ బాధ పడేది చూడలేక - రమతల నిమురుతూ—]

సుబ్బ : (విచారంగా) ఏడుస్తున్నావా తల్లీ !

రమ : (లేచి సుబ్బయ్యవైపు విచారంగా చూస్తూ) నాకు చివరికి మిగిలేదేమిటి తాతా ?

సుబ్బ : అమ్మా !

రమ : ఏం చూసుకొని నేను జీవించాలి? అపార్థం చేసుకొని వారు పగవారయ్యారు. వారికి నాముఖం చూడరు. కన్నతండ్రీ ... కాలంతీరి కలరానో పోయారు. (వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

సుబ్బ : ఏడవకమ్మా! ఏడవకు! ... ఇప్పుడు యిక్కడ నీకు ఏం లోటయిందని చెప్పు? మధు నీ సంసారం నిలుపుతాడమ్మా!

రమ : ఏం నిలుపుతాడో తాతా! నేను మధుపంచన చేరానని వూరంతా ఒకటే గుసగుసలు.

సుబ్బ : అవునమ్మా! అవును. అంతా చాటుమాటుగా

నీచంగా అనుకోవడం నేనూ వింటూనే వున్నా! అందుకనే, మధు యింటికిరాకుండా ఆస్పత్రిలోనే వుంటున్నాడు...లోకులు కాకులై ఎన్నో అంటారు. మనలో నీతి నిజాయితీ వున్నంతవరకు భయం లేదమ్మా! మనం జవాబివ్వాల్సింది మనుషులకు కాదమ్మా - మనస్సుకు! ... బాధపడకమ్మా! మీవారు నీవారౌతారు. నిజం తెల్సుకొని నిందించిన లోకులే నీకు చేతులెత్తి మొక్కుతారు. నీవు లేచి మధూకు టిఫిన్ అదీ పెట్టిస్తే-నేను పోతా!

రమ : నేను యింటికి రమ్మన్నానని మధూతో చెప్పు తాతా!

సుబ్బ : రాలేరనుకొంటా! ఊళ్ళో కలరా ఎక్కువగా వుంది. అక్కడికీ యిక్కడికీ తిరుగుతున్నారు. ఏమొస్తారో ఏమోనమ్మా!

రమ : నేను రమ్మన్నానని చెప్పు! అంతే!

సుబ్బ : సరేనమ్మా! (సుబ్బయ్య వెళ్ళిపోతాడు. రమ విచారంగా కూర్చొనివుంటుంది. పక్కనేవున్న ఫోను రింగ్ చేస్తుంది. రమ రిసీవరందుకొని—)

రమ : హల్లో! ... ఎవరూ? (అవతలవేపు చెప్పేందుకు తటపటాయించి) రమ స్పీకింగ్! ... జస్టిస్‌గారా? - లేరు ... సర్జన్ మధు డిస్పెన్సరీలో వున్నారు ... డిస్పెన్సరీకి రింగ్ చేసి చూడండి! ... మీ రిక్కడకు వస్తారా? ... ఎందుకూ?-ఇంతకూ మీరెవరు?... ఆ? శేఖర్!! (రిసీవర్ ఫోన్ మీద పెట్టేస్తుంది

పరుపుమీద పడుకొని కుమిలికుమిలి ఏడుస్తూ వుంటుంది. బయట కారాగిన చప్పుడౌతుంది. మధు ప్రవేశిస్తాడు. మాసినబట్టలు పెరిగినగడ్డం లోతుకు పీక్కుపోయిన కళ్ళు పాలిపోయినముఖంతో చాలా మారిపోయివుంటాడు. ముఖంలో బాధ స్ఫుటంగా కన్పిస్తుంది. మాటాడే ప్రతిమాటా బరువుగాను, ఆవేదనతోను సమ్మిశ్రితమై వుంటుంది. రమ పడుకొనివున్న మంచందగ్గరకుపోయి – రమ కుళ్ళి కుళ్ళి ఏడవటం చూసి – పిలవబోతాడు. గొంతు పెగలక బాధగా లోపలికెళ్ళిపోతూవుంటాడు. రమ తలెత్తి చూసి –) మధూ!

మధు : (ద్వారం పట్టుకొని ఆగి) ఊ!

రమ : (సమీపించి) ఇన్నాళ్ళూ యింటికిరాలేదేం? (పలకడు) నాకేమన్నారు మధూ! (మధు మౌనంగా అటుతిరిగివుండటం చూసి) నాముఖం చూడనని ఒట్టేసుకొన్నావా?

మధు : లేదు రమా!

రమ : అలా వున్నావేం మధూ!

మధు : (పరధ్యానంగా అటువెళ్తూ) ఎలా వున్నాను?

రమ : (బాధపడుతున్నట్టు) ఇంతకూ నాకేమన్నావు?

మధు : (కుర్చీలో కూర్చొని తలపట్టుకొంటూ) అబ్బా!

రమ : (మధు నొసటిమీద చేయివేసి) ఏం మధూ తలనొప్పిగావుందా? (మధు గాబరాగా లేచాడు. ఒళ్ళంతా కంపిస్తూ వుంటుంది. క్షణంలో కళ్ళు

చెమ్మగిల్లాయ్.) కాఫీ తీసుకో మధూ! తలనొప్పి పోతుంది. తెచ్చేదా?

మధు : ఒద్దు రమా! ఇప్పుడు నాకు తాగాలని లేదు.

రమ : పోనీ, ఫలహారం? - ఎప్పుడు తిన్నావో ఏమో!

మధు : (విసుగ్గా) అబ్బబ్బ, నీవేమీ మాట్లాడకు రమా!- నాకేమీ ఒద్దంటుంటే -

రమ : ఇప్పుడు నేనేమన్నానని యింతకోపం? చెప్పు మధూ! ఈ అర్థంలేని ఆవేశం - కారణంలేని యీ కోపం ఎవరిమీద? (కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. పమిటతో కళ్ళొత్తుకొంటూ లోనికెళ్ళి ఫలహారం పట్టుకొస్తుంది. మధు టీపాయిమీద తలపెట్టుకొని కుమిలికుమిలి ఏడుస్తుంటాడు. రమ ఫలహారం టీపాయిమీద పెట్టూ -) తీసుకో మధూ!

మధు : (తలెత్తి కళ్ళుతుడుచుకొంటూ) రమా! ఏదో చెప్పబోయి ఆగి మాటమారుస్తూ) ఎందుకు నీకీ శ్రమ? నువ్వీపనులు చేయడం నాకిష్టంలేదు.

రమ : సరే, ముందు ఫలహారం కానియ్.

మధు : నాకు ఏమీ ఒద్దు. ఆకలిగాలేదు రమా!

రమ : నీకు ఆకలిగాలేదా? నాముఖంచూసి నిజంచెప్పు మధూ?

మధు : (రమముఖంలోకి చూసి బాధపడుతూ) లేదు రమా! నీతో అబద్ధం ... (కంఠం జీరపోతుంది)

రమ : పోనీ, కాఫీ అయినా తీసుకో! (రమ అందిస్తుంది. మధు లేచి అందుకోబోతాడు. చేతులు వణుకు

తుంటాయి. అందుకోవడంలో కప్పు సాసర్ క్రింద పడి పగిలిపోతాయి. ఆదుర్దాగా యిద్దరూ ఒకేమారు క్రిందకు ఒంగుతారు. ఇద్దరి తలలు ఢీకొంటాయ్. మధు మానసికంగా బాధపడుతూ దూరంగా తొలుగుతాడు. రమ మధువిచిత్రమనస్థితి చూసి) ఎందుకు అలా దూరదూరంగా తొలగిపోతావ్ మధూ ?

మధు : నా బాధ నీకు అర్థంకాదు రమా! ... అబ్బ!... నీకు ఎలా చెప్పడం? ... ఎంతకాలమని యిలా దాచిపెట్టను? ... కుమార్ దృష్టిలో మనం అపరాధులం – చరిత్రహీనులం! వచ్చినవాడు మనం చచ్చినా పోదు రమా! ... ఈ లోకులంతా ఏమంటున్నారో తెలుసా? నీవు మొగుణ్ణి వదిలేశావనీ – నాతో లేచివచ్చావనీ—భగవాన్!

రమ : మధూ!

మధు : ఇదీ సమాజంలో మనచరిత్ర! (ఇద్దరిమధ్యా క్షణం నిశ్శబ్దం. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ టెలిఫోన్ రింగ్ చేస్తుంది. మధు రిసీవరందుకొని) హల్లో! ... మధు స్పీకింగ్! ... ఎందుకు పిలిచావ్ పార్వతీ!... ఆ– కలరా కార్మికవాడకూ వ్యాపించిందా? ... మన నమ్ములిద్దరిలో ఆ లక్షణాలు కనిపిస్తున్నాయా? ఇదిగో యిప్పుడే వస్తున్నా. ఇక బయల్దేరడమే! (రిసీవర్ హుక్ మీద పెట్టేసి వెళ్ళబోతాడు.)

రమ : ఎక్కడికి మధూ?

మధు : దోమలతో - ఈగలతో - దరిద్రంతో - మురికిలో దోబూచులాడే కార్మికవాడనూ కలరా వ్యాపించింది.

రమ : నీవు అక్కడికి వెళ్ళొద్దు మధూ!

మధు : అదేంమాట రమా? బాధ్యతగల వైద్యవృత్తి నాది. డాక్టరుగా నా బాధ్యతను ...

రమ : ఆపదలోవున్న అందర్నీ ఆదుకోలేం మధూ! దేనికైనా సమయం సందర్భం వుంది. కలరాతో మా నాన్నను చూశాను. అబ్బ! అది తల్చుకొంటే...

మధు : చస్తాననేనా నీ భయం? ఎప్పుడో ఒకప్పుడు అది తప్పదు...మనం పుడతాం - పెరుగుతాం-ఎప్పుడో ఎక్కడో రాలిపోతాం! ఇందులో చరిత్ర - చరిత్రాగం ఏముంది రమా? నా ఒక్కని ప్రాణం చూసుకొంటే - వైద్యసదుపాయంలేక మృత్యువుతో పోరాడే ఆ కార్మికులేంకావాలి? నన్ను వెళ్ళనీ రమా!

రమ : (మధూ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ) మధూ! నేను నీకు దూరమయ్యాననేగా - నీ బ్రతుకుమీద నీ కింత రోత.

మధు : (బాధగా) రమా!

రమ : నేను నీదాననయ్యుంటే - నీ విలా ...

మధు : రమా! ... అపార్థంచేసుకొంటున్నావ్! చావు బ్రతుకుల్లో వున్నవారికి సేవచెయ్యడం నా విధి.

రమ : నీవు లక్ష చెప్పు - నేను నిన్ను పోనివ్వను.

మధు : రమా ! ఏమిటీ మంకుపట్టు. నన్ను వెళ్ళనీ !

రమ : నేను వెళ్ళనివ్వను.

మధు : వీల్లేదు. (రమను తప్పుకొని ముందుకు అడుగు వేస్తాడు.)

రమ : (మధూ కాళ్ళుపట్టుకొని) వెళ్ళకు మధూ ! ... నా చావు నీకళ్ళ చూడాలనుకొంటే వెళ్ళు. (మధు పాదాలమీద తలఆన్చి వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

మధు : (బాధపడుతూ) రమా ! ఏమిటీ బలహీనం ? (లేవ నెత్తబోతాడు. తాకేందుకు చేతులురావు. పాదాల్ని వెనక్కులాక్కొని వెళ్ళి బుద్ధవిగ్రహంమీద చేయి వేసి -) భగవాన్ ! ఇంకా నన్నెందుకుంచావ్ ? అడుగడుగునా ఏమిటీ అగ్నిపరీక్ష ? భరింపలేనీ రంపపుకోత.

రమ : (లేచివచ్చి చేయి చాచి) అక్కడికి వెళ్ళనని ఒట్టేయి మధూ !

మధు : రమా ! ఎందుకు నన్నిలా చేతకానివాణ్ణిచేసావ్ ? (రమచేయిలో చేయివేయబోయి) నీవు పరస్త్రీవి ! నిన్ను తాకలేను. నీ సతీత్వం అపవిత్రమౌతుంది.

రమ : పర్వాలేదు మధూ ! మన మనస్సుల్లో మాలిన్యం లేదులే !

మధు : సరే ! (రమచేతిలో చేయివేస్తాడు. మధు కన్నీటి బొట్టొకటి రమచేతిమీద పడుతుంది.)

రమ : ఏడుస్తున్నావేం మధూ ?

మధు : నీవెళ్ళి కాఫీ పట్టుకరా, పో రమా ! (రమ లోపలి

తెస్తుంది. మధు టేబిల్ దగ్గరకెళ్ళి లెటర్ పాడ్ మీద ఏదో వ్రాసి తెచ్చి పాడ్‌తో కూడా టీపాయిమీద పెట్టి వెళ్ళిపోతాడు. రమ ప్రవేశించి కాఫీ టీపాయిమీద పెట్టి అక్కడున్న లెటర్ పాడ్ చూసి తీసుకొని, చుట్టూ మధూకోసం చూస్తుంది. మధు కన్పించడు. ఆ లెటర్ పాడ్ లోనికి చూస్తూవుండగా తెరలో:)

రమా !

నీకు మాటిచ్చి నిన్నుకాదని పోతున్నాను. బాధపడకు. కోటిమానవసేవే నా జీవితపరమార్థం. డాక్టరుగా నా బాధ్యతను నిర్వర్తించక తప్పదు. అక్కడికిపోతే - నాకూ కలరా సోకుతుందనేనా నీభయం? నాది మొండి బ్రతుకు రమా! చావుకూ నేనంటే భయం.

రమ : ... ... మధు. (ఆ లెటర్ పాడ్‌ని టీపాయిమీదనే పడేస్తుంది. ఆమె ముఖంలో ఏ భావమూ వుండదు. టేబిల్ దగ్గరకెళ్ళి దానిసొరుగుల్లో దేనికోసమో వెతుకుతుంది. చేతిలోకి పిస్టల్ వస్తుంది పిస్టల్ తీసుకొని ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చి, టీపాయి ముందు కూర్చొని, మధు వ్రాసిపెట్టిన లెటర్‌ను చించి అవతలపారేసి - ఏదో వ్రాసి - మహాత్ముని పటంముందు నిల్చొంటుంది. అదేసమయంలో ఉమాకాంత్ బయటినుండి వస్తాడు. రమ చేతిలో పిస్టల్ వుండటం చూసి విస్మయంతో వెళ్ళి రమ వెనుక నిలబడతాడు.) మహాత్మా! మీరు యుగ

పురుషులు. భగవత్స్వరూపులు. నేను తెలిసీ నా భర్తకు ఏ అన్యాయమూ చేయలేదు. వారిని మన సారా గౌరవించి - అన్యోన్యంగా వారితో కాపురం చేశాను. అందరిలా సగర్వంగా బ్రతకాలనుకొన్నా ... (నోరుపెగలదు) నా స్థితికి ఎవరినీ నిందించను. నేనుపోతే ఎవరికీ ఏ సమస్యా ఏ అపనిందా వుండదు. మనుజన్మలో నా బ్రతుకు నాభర్తతోనే ముడిపెట్టు ప్రభూ !... అంతే నేను కోరేది. (కళ్ళుమూసుకొని కణతకు గురిపెట్టుకొని కాల్చుకోబోతుంది. ఉమా కాంత్ రమచేతిలోనుండి పిస్టల్ లాక్కుంటాడు. రమ వెనుతిరిగి చూసి) ఆ !

ఉమా : ఏమిటమ్మా యీ తెగింపు. (రమ లోపలికెళ్ళి పోతుంది.) రమా ! ... రమా ! ... (ఉమాకాంత్‌కు ఏమిచెయ్యాలో అర్థంగాక యిటూ అటూ తిరుగుతుంటాడు. కుర్చీలో కూర్చొని ఆలోచించి లేచి వెళ్ళి రిసీవరందుకొని రింగ్ చేస్తాడు)...హల్లో ! ... yes. ఉమాకాంత్ స్పీకింగ్ ! ... మధు వున్నాడా ?...వెంటనే యింటికి పంపండి. త్వరగా పంపాలి. (రిసీవర్ హుక్ మీదపెట్టేసి—)రమా !... రమా!(పిలుస్తూ గుమ్మంవరకూపోతాడు. గుమ్మంలో రమ ఎదురౌతుంది.) రామ్మా ! ... ఏమిటిది చెప్పు ? నిండుప్రాణాలు తీసుకొంటావా ? దీనివలన నీవు పొందేదేమిటో చెప్పు !

రమ : నేను బ్రతికీ ఏం ప్రయోజనం ?

ఉమా : అనినీవనుకొంటున్నావ్?...చూడమ్మా! నీ విలా బ్రతుకు చాలించుకొంటే - వచ్చిన అపవాదు పోతుందా? (మధు వచ్చి ఉమాకాంత్ ప్రక్కన నిల్చుంటాడు) మధూ! మన రమచేసిన తెగింపు చూశావా? (చేతిలోని పిస్టల్ చూపిస్తాడు)

మధు : ఆ! (గుటకలుమింగుతూ) ర...మా!

ఉమా : చూడు మధూ! రమ బాగుకోసం నీవు ఏమైనా చేస్తావుకదూ!

మధు : చేస్తానన్నయ్యా!

ఉమా : మాటివ్వాలి. (మధు తటపటాయించడం చూసి) రమకు మనసిచ్చావ్! పుచ్చుకొన్నావ్! రమ కోసం మాటివ్వలేవా?

మధు : అలాగే!

ఉమా : నీవు వెంటనే పెళ్ళిచేసుకోవాలి.

మధు : ఆ! రమబ్రతుకు బాగుపడేందుకూ - నాపెళ్ళికీ సంబంధమేమిటి?

ఉమా : చెప్పేది విను. నీవా ఒంటరివాడివి. రమకు మనం ఆశ్రయమిచ్చాం. నీనిని లోకులు అపార్థంచేసుకొని నిందలువేస్తున్నారు. నీకు పెళ్ళయితే అప్పుడు యిన్ని రాద్ధాంతాలుండవ్! ఏమంటావ్?...నీ అసిస్టెంట్ సర్జన్ పార్వతి నీపై ఆశలుపెట్టుకొందని...

మధు : అది నా తప్పా? మరి నా ఆశలు ఎవరుతీర్చారు?

ఉమా : అబ్బ, నేను చెప్పేది వినరా! నిజానిజాలు తెలిసి రమ సంసారం నిలిచేవరకు - మనం రమకు ఆశ్రయ

మివ్వాల్నా ? అంతవరకు రమను సహృదయంతో ఆదరించగలది- పార్వతి ఒక్కతే! మీ చరిత్రా-మీ మనస్సూ ఆమెకు తెలుసు. కనుక. అపార్థం చేసుకోక రమను ఆదరిస్తుంది.

మధు : పార్వతితో జీవితమంతా ఎలా భరించమంటావన్నయ్యా ?

ఉమా : అసలు, రమ బ్రతుకు బాగుపడ్డం నీకు యిష్టం లేదులేరా !

రమ : } మామయ్యా ! (ఒకేమారంటారు).
మధు : } అన్నయ్యా!

ఉమా : అలాఅయితే, నిన్ను పెళ్ళిచేసుకొంటానని పార్వతికి ఫోను చెయ్ !

మధు : (రిసీవరందుకొని డైల్ చేసి) పార్వతీ ?...నువ్వేనా మాట్లాడేది. పారూ ! ... (కనుకొలుకుల్లోనిల్చి, మాటపెగిలిరాక రిసీవర్ హుక్ మీద పెట్టేస్తాడు, బాధగా)

ఉమా : మధూ !

మధు : (ఉమాకాంత్ వేపు నిస్సహాయంగాచూసి, బాధగా రమ వేపు చూస్తాడు. రమ మధుమనస్తాపాన్ని చూడలేక బాధగా లోపలికెళ్ళిపోతుంది. మధు బాధను దిగ మ్రింగి రిసీవర్ అందుకోబోతాడు. అందుకోనే లోపలే ఫోను రింగ్ చేస్తుంది. రిసీవరందుకొని) హాల్లో !...మధు స్పీకింగ్!...సమితీ ! ప్లీడర్ రామా

రావుకు మళ్ళీ గుండెపోటు వొచ్చిందా?

...Yes. వస్తున్నా.

ఉమా : ఏమిటి మధూ? రామారావుకు ఏమయింది?

మధు : మళ్ళీ గుండెపోటొచ్చింది. పరిస్థితి ప్రమాదకరంగా...

ఉమా : (కంగారుగా) పద మధూ! త్వరగా వెళ్దాం! (చేతిలో వున్న పిప్పల్ని ఆ కంగారులో టీపాయిమీద పెట్టి, యిద్దరూ బయటికెళ్ళిపోతారు. కొద్దిక్షణాలు రంగస్థలంలో ఎవరూవుండరు. తరువాత లోపల నుండి రమ, బయటినుండి శేఖర్ ఒకేమారు ప్రవేశిస్తారు. ఒకర్నొకరు చూసుకొంటారు. రమ వెనుతిరిగి వెళ్ళబోతుంది.)

శేఖర్ : (నవ్వుతూ) కన్నెత్తి చూడకపోతే పోనీ - పన్నెత్తి పల్కరించకూడదా?

రమ : (వెనుతిరిగి) మర్యాదగా బయటికి నడు.

శేఖర్ : నీవూ నాతోవస్తే!

(కుమార్ త్వరత్వరగా రాబోయి 'ఛీ, నోర్ముయ్!' అని రమ బిగ్గరగా అనడం విని అక్కడేఆగి - శేఖర్నిచూసి చాటుగా నిల్చుంటాడు)

శేఖర్ : అదే వద్దంటా! నీ వల్లా మనసులేకుండా మాట్లాడితే...

రమ : మంచిగా మర్యాదిచ్చి చెప్తున్నా - వెళ్ళిపో!

శేఖర్ : వెళ్ళడానికైతే యిన్ని పనులు చేస్తానా?

రమ : శేఖర్! నీ కిది ధర్మంకాదు. ఎందుకు నన్నింకా బాధిస్తావ్?

శేఖర్ : ఎందుకుబాధ! నామాట విను. నీ శ్రేయస్సుకోసే వచ్చాను. వెళ్ళిపోదాం రా. నీవు నాదానివి! మన వారంతా నీవుపుట్టగానే నాభార్యవన్నారు. విధి వక్రించింది. ఎందుకు యీ ఒంటరి బ్రతుకులు చెప్పు? నువ్వు 'ఊ'అను. జంటగా మార్చుకొందాం.

రమ : జాగ్రత్త. ఒళ్లుదగ్గరుంచుకొని మాట్లాడు.

శేఖర్ : అయితే, వాడు – వాడేనే, కుమార్! ఇక నీతో కాపురంచేస్తాడనుకొంటున్నావా?

రమ : మా దాంపత్యంలో నిప్పులు పోశావుగా– చాలదూ?

శేఖర్ : మీ దాంపత్యంలోనేకాదు. మధూనుండి నిన్ను వేరుచేసిందికూడా నేనే.

రమ : నీవా!

శేఖర్ : అవును. నీవు నన్నుకాదన్నావ్. నా గుండె రగిలింది. నీవు ఏజాబునైతే నమ్మి మధూనికాదని కుమార్ని పెళ్ళాడావో– ఆ లెటర్ వ్రాసింది ...

రమ : నీ...నా!!

శేఖర్ : ఆ– నేనే! మాయిద్దరిదస్తూరీ ఒకటిగా వుంటుందని నీకూ తెల్సు. ఆ సమయంలో నీ విది మర్చిపోయి బోల్తాపడ్డావ్. డామిట్! కథ అడ్డంతిరిగింది. మధూనుదూరంచేస్తే నన్నే చేసుకొంటావనుకొన్న నీవు– కుమార్ని పెళ్ళాడావు. అయితేనేం! నీ భర్త

దగ్గరా నా పాచిక పారింది. నుఘూకూ నీకూ లేని సంబంధాన్ని ఎంత నేర్పుగా చెప్పానో తెలుసా?

రమ : నన్నెందు కిలా నాశనంచేశావ్?

శేఖర్ : నీ కోసం. వెన్నెలను చిలికించి కవ్వించి మైమరపించే నీ సౌందర్యంకోసం చేశాను. ఇప్పటికైనా నువ్వు నన్ను కాదంటే - యింకా ఏమైనా చేస్తా.

రమ : ఛీ, ఏంమనిషివి నువ్వు.

శేఖర్ : నీవు ఎన్నయినా అను. నామనసు నీకు తెల్సుగా! రమా! నామాట విను. ఎవ్వరూలేరు. ఏదీ -

రమ : ఏమి టీ జబర్దస్తీ? దూరంగా వుండి మాట్లాడు. మఘూను మనసారా ఎంచుకొన్నా, ఎప్పుడూ నీచంగా ప్రవర్తించి నా శీలాన్ని - వ్యక్తిత్వాన్ని నేను పోగొట్టుకోలేదు. శేఖర్! నా శీలంకోసం - నావ్యక్తిత్వంకోసం చావనైనా చస్తాను. కానీ. . .

శేఖర్ : (రమచేయిపట్టుకొని) మాటలు నేర్చావే!

రమ : వెధవ్వేషాలు వేస్తే (లెంపకాయవేసి) దవడపళ్ళు రాలగొట్టడంకూడా నేర్చుకొన్నాను.

శేఖర్ : (రమ నడుముచుట్టూచేయివేసి దగ్గరకు లాక్కుంటాడు. రమ కెవ్వున కేక వేసి శేఖర్ చెయ్యి కొరుకుతుంది. రమ మాటలన్నీవిని, సంతోషిస్తున్న కుమార్ రమకేక విని తేరుకొంటాడు. రమ శేఖర్ కౌగిట్లో పెనగులాడుతూ వుంటుంది. కుమార్ కోపం పట్టలేక వెళ్ళి శేఖర్ వెనక చొక్కాపట్టుకొని లాగి ముందుకు త్రిప్పుకొని మూతిమీద చడామడా

కొట్తాడు. బలంగా మూతిమీద కొట్టినదెబ్బతో శేఖర్ వెళ్ళి టీపాయిప్రక్కన పడ్తాడు.)

కుమార్ : దుర్మార్గుడా! నీ కపటనాటకమంతా తెల్సింది! ఇక నీఆటలు సాగవ్ !

రమ : ఏమండీ!

కుమార్ : రమా ! (ముందుకువెళ్ళి రమను కౌగిట్లోకి తీసుకొంటాడు)

రమ : నేను . . . నేను . . .

కుమార్ : (ఆనందంలో ఏగో చెప్పబోతాడు. చెప్పలేడు. తరువాత) నిజం తెలియక నీచంగా ప్రవర్తించాను. పశువునై నిన్ను చంపాలనివచ్చాను. నేనుక్షమార్హుణ్ణి కానురమా!(రమ చేతులుపట్టుకొని) నన్ను క్షమించావనవూ !

రమ : మీరే నన్ను క్షమించాలి.

(వీరు యిలా మాట్లాడుకొంటూ వుండగా- టీపాయి ప్రక్కనపడిన శేఖర్ నోటినుండి రక్తంకారుతుంది. చేత్తో బాధగా మూతితుడుచుకొన్నాడు. చేతిలో రక్తంకనిపిస్తుంది. కళ్ళు ఎర్రబడ్డాయి. తల విదిలించుకొని చూస్తాడు. ముఖం క్రోధంతో ఎర్రబడుతుంది. టీపాయికి చేయిఆన్చి లేవబోతాడు. చేతికి పిస్టలు తగుల్తుంది. దానిని చేతిలోకి తీసుకొని చూస్తాడు. అతనిలో పశుత్వం ఆవేశిస్తుంది. భీకరంగా కుమార్ వైపు చూస్తాడు. ఇదంతా వీరిద్దరూ

మాట్లాడుకొంటూవుండగా జరుగుతుంది. తర్వాత శేఖర్ లేచి నిల్చొని-)

శేఖర్ : (సీరియస్‌గా) కుమార్ ! (కుమార్ యిటుతిరుగుతాడు. శేఖర్ పిస్టల్ పేలుస్తాడు. అప్పుడే విద్యాసాగర్ ఉమాకాంత్ మధూలు ప్రవేశిస్తుంటారు. రమ కెవ్వున కేకవేసి కుప్పగా కూలిపోతుంది. కుమార్ 'అబ్బా' అంటూ ముందుకూ వెనక్కూ బాధగా తూలుతూవెళ్ళి మంచంమీద స్పృహతప్పి పడిపోతాడు. ఉమా - విద్యా- మధూలు ఆదుర్దాగా రమా - కుమార్‌లదగ్గరకు పోతారు. విద్యాసాగర్ నీళ్లుతెచ్చి రమముఖంమీద చల్లుతాడు. ఉమా - మధూలు కుమార్‌ను మంచంమీద సరిగాపడుకోబెట్తారు. మధు కుమార్‌ని పరీక్షిస్తుంటాడు. పిస్టల్ 'ఠాం' అని పేలగానే శేఖర్ తన తప్పు తెల్సుకొంటాడు. అక్కడనుండి మెల్లగా జారుకొంటూవుంటాడు. పై పనులన్నీ చకచక జరిగిపోతాయ్. ఉమాకాంత్ శేఖర్ పారిపోయేది చూసి)

ఉమా : శేఖర్ !... శేఖర్ ! (అంటూ బయటికి పోతాడు. బయట కారు స్టార్టయినశబ్దం, కదిలి పోయిన చప్పుడు, హారన్ విన్పిస్తాయి. తరువాత ఉమాకాంత్ ఆదుర్దాగావచ్చి రిసీవరందుకొని డైల్ చేసి) హలో పోలీస్‌స్టేషన్ ! జస్టిస్ ఉమాకాంత్ స్పీకింగ్ ... యస్ టు ది నిర్మలాభవన్. ..... ... గుడ్‌మార్నింగ్. A. P. D. 881 పోల్చు

రాయ్‌లో పారిపోయే వ్యక్తిని వెంటనే అరెస్టు చెయ్యండి ! . . . yes ! Mr. కుమార్‌ని పిస్టల్‌తో కాల్చి పారిపోతున్నాడు. . . . ఊఁ - క్విక్ ! . . . ఆ - కుమారా? స్పృహలో లేడు. . . . అవసరం లేదు. సర్జన్ మధు పరీక్షిస్తున్నాడు. . . . yes! (రిసీవర్ పెట్టేసి మధూదగ్గరకొస్తాడు. మధు పరీక్షించడం పూర్తయ్యి, టేబిల్ దగ్గరకెళ్ళి మెడిసన్ బాక్సులోనుండి యింజెక్షన్ బాటిల్, సిరంజి తీసి డిస్టిల్ వాటర్ కలుపుతూవుంటాడు. రమకు విద్యాసాగర్ స్పిరిట్స్ అమ్మోనియమ్ తెచ్చి రమముక్కు దగ్గరుంచుతాడు. ఆ వాసనకు రమకు స్పృహవస్తుంది. అయోమయంగా విద్యాసాగర్ వేపుచూస్తుంది. లేచి కూర్చుంటుంది. లేవ ప్రయత్నిస్తుంది. విద్యాసాగర్ సహాయంతో లేచివెళ్ళి కుమార్ తలను తనఒళ్లో పెట్టుకొని భర్తముఖంలోకిచూస్తూవుంటుంది. విద్యాసాగర్ కుమార్‌ని పరీక్షిస్తుంటాడు. అతని ముఖంలో అసంతృప్తి, విచారఛాయలూ ఆవరిస్తాయి. అక్కడనుండి మధూను సమీపిస్తాడు. మధుముఖంలో విపరీతమైన బాధ వ్యక్తమౌతూ వుంటుంది. అన్యమనస్కుడై ఎటోచూస్తూ ఏదో ఆలోచిస్తుంటాడు. విద్యాసాగర్ మధుభుజాన్ని నొక్కుతాడు. మధు విద్యాసాగర్ ముఖంలోకి బాధగా చూస్తాడు.)

ఉమా : ఏం మధూ !

మధు : (బాధగా ఉమాకాంత్ ముఖంలోకి, రమ ముఖంలోకి చూస్తాడు. మధు ముఖం త్రిప్పేసి అన్యమనస్కంగా ఎటో చూస్తుంటాడు. సిరంజినొక్కుట వలన దానిలోనినుంచు ఎగజిమ్మి ఆనుంపరలు మధు ముఖంమీద పడ్డాయి. మధు తోసుకొంటాడు.)

ఉమా : (అర్థయుక్తంగా మధూ వేపు చూస్తాడు.)

(కుమార్ బాధగా మూలిగి కదుల్తాడు)

మధు : (పెదాలుతడిచేసుకొంటూ) మేము చెయ్యగలిగిందేమీ లేదయ్యా!

ఉమా : (విద్యాసాగర్ వైపు చూస్తాడు)

విద్యా : (బాధగా తలొంచుకొంటాడు)

కుమార్ : మధూ! (రమ భర్తముఖంలోకి చూస్తుంది. మధు – విద్యాలు కుమార్ దగ్గర కెళ్తారు.) ఆయువు నిండితే నీవేం చెయ్యగలవ్?

మధు : లేదు కుమార్! నువ్వు...

కుమార్ : చివరిఘడియల్లో ఉన్నాను. అంతేనా? (బాధగా రమ వేపు చూసి) రమా!

రమ : ఊఁ!

కుమార్ : ఏమిటి ఆలోచిస్తున్నావ్? (రమ చేతుల్లో ముఖందాచుకొంటుంది) ఎందుకు రమా ఏడుస్తావ్? నేను చచ్చిపోతా...(రమ కుమార్ నోటికి చెయ్యి అడ్డంపెట్టుంది. ఎక్కడనుండో ఎవరిగొంతునుండో విషాదంగా రాగాలాపన ఆగిఆగి వినిపిస్తూవుంటుంది.)

కుమార్ : నేను పోతే...

TPLA101B189



ఉమా : చూడండి కుమార్! ఎందుకలా దిగజారిపోతారు. ...మీకేం పర్వాలేదు.

కుమార్ : ష్ - అబ్బా!

మధు : (కుమార్ చేతిని తనచేతిలోకి తీసుకొని) కుమార్!

కుమార్ : నేనుపోతే రమేమౌతుంది మధూ?...రమను ఎవరు ఆదరిస్తారు?...ష్ - అబ్బా!

విద్యా : మరీ బాధగావుందా కుమార్?

కుమార్ : విద్యా! నాగురించేమీం బాధలేదు. బా... ధంతా... (బాధగా రమవేపు చూస్తాడు)

విద్యా : కుమార్!

కుమార్ ! నాదారిన నేను పోతే...

విద్యా : ఎందుకు కుమార్! ఇప్పుడవన్నీ?

కుమార్ : ...మధూ! నేను పోతున్నా! పోయేముందు... ష్ - అబ్బా! ...నీవు వాగ్దానంయిస్తే... ఆనందంగా అమరజీవినౌతా! రమను నీవుతప్ప ఎవరూ అర్థంచేసుకోలేరు. ఆదరించనూలేరు.... రమ బ్రతుకంతా నీతో ముడిపెట్టున్నాను. ... చెప్పు మధూ! నాకోసంకాక (రమచేతిని తన చేతిలోకి తీసుకొని) పోయినా - (మధూచేతిని తన చేతిలోకి తీసుకొంటూ) రమగర్భంలో పెరిగే నా ప్రతిబింబం కోసమైనా (ఇరువురిచేతులూ కలుపబోతూ) నీవు రమను స్వీకరించు. (చేతులు కలవకముందే తన చెయ్యినిలాక్కొని రెండుచేతుల్లో ముఖందాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తుంది రమ.)



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRKA 101 B 189 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | praveyusha |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |